లక్ష్మీనారాయణ గ్రంథమాల-15.

మార్కస్ అరేలియస్

# ఆత్మచింతనము

మూలము :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగార

అనువాదము :

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

ప్రకాశకులు :

లక్ష్మీనారాయణ గ్రంథమాల,

24—ఎ. తాండవరాయగ్రామణి వీథి,

మదరాసు-21.

# ము న్ను డి

వసుధేశ్వరులు భోగలాలసులై తమ వలపునేస్తము లగులావణ్యలతికలతో సరససల్లాపము లాడుచు కాలము గడపుచుందు రని మనము సాధారణముగా అనుకొనుచుందుము. ఇందు కొంతవఱకు నిజము లేకపోలేదు. అయినను తత్త్వవేత్త యైనవేమన చెప్పినట్లుగా పురుషులలో పుణ్యపురుషులవలె రాజులలోను రాజర్షులు కొందఱు ఉన్నారు. కనుక రాజమాత్రులెల్లరును భోగలాలసులే యనుట సాహసమనిపించుకొనును.

మన భారతావనిలో రాజర్షు లని పేరుపెంపులు గడించినవారిలో ముఖ్యులు విదేహుడైనజనకమహారాజును, శాక్యర్షి యైన గౌతమబుద్ధుడును. అటులనే రోమక రాజ్య రాజర్షిగా దిశాష్టకము నావరించు యశస్సు సముపార్జించిన మహాత్ముడు మార్కస్ అరేలియస్ ఆంటోనినస్ !

క్రీస్తుశకము 121 వ సంవత్సరము ఏప్రిల్ నెల 26 న అన్నియస్ వీరస్, లుకిల్లా అను పుణ్యదంపతులకు మార్కస్ అరేలియస్ ప్రభవించెను. పండిత ప్రకాండు లగుకర్నీలియస్ ఫ్రాంటో, హిరోడెస్ అట్టికస్ మొదలగువారియొద్ద అతడు కావ్యాలంకార శాస్త్రములు నేర్చెను. కాని ఆధ్యాత్మిక విషయములే అతని హృదయమును వశంవదము చేసికొనెను. ఈ కారణమున అతడు కావ్యాలంకారశాస్త్రాధ్యయనమునకు స్వస్తి చెప్పి తాత్త్విక రహస్యములను హృద్గతము చేసికొన మొదలిడెను. తుదకు మార్కస్ రాజోచిత మైనవేషధారణమును కూడ పరిత్యజించి ఆనాటి తాత్త్వికుల వేషధారణము నవలంబించెను. అయినను అతడు 161 వ సంవత్సరమున సింహాసనము నధిష్ఠించెను. గృహస్థాశ్రమమును కూడ స్వీకరించి కమోడస్ అను ఏకకుమారుని పొందెను. పందొమ్మిదేండ్లు రాజ్యపరిపాలన మొనర్చి మార్కస్ అరేలియస్ క్రీ. శ. 180 వ సంవత్సరము మార్చి 17 న దైవికము చెందెను.

నానాటికి పరిణతి పొందుచున్న తన జీవితానుభవములకు స్టాయిక్ తాత్త్విక స్వరూపము నొసగి వానిని మార్కస్ వ్రాసికొనుచుండెనట ! అట్లొనర్చుటలో అతని యాశయములు రెండు. ఒకటి: తన్ను తాను సంస్కరించుకొనుట. మఱియొకటి: తన కుమారుడు కమోడసునకు ధర్మపథమును చూపుట. అంతేకాని లోక సంస్కారార్థము ధర్మసూత్రములు

వల్లెవేయుచు నొక వేదాంత గ్రంథమును సంతరింపవలయు నని అత డభిలషించి యుండలేదు. అనగా ఆత్మోద్ధరణము వాంఛించియే మార్క్సు గ్రంథరచన చేయసాగె నని నుడువుట సమంజసము. కాని శోచనీయ మేమనగా కమోడస్ తనతండ్రి యనుసరించిన ధర్మపథము నవలంబింపలేదు. అయినను బుద్ధిమంతు లెవరో కొందఱు మార్క్సు వ్రాసికొనిన గ్రంథమును భద్రపఱచి దానిని లోకమున కందజేసి పుణ్యము కట్టుకొనిరి. తదాదిగా మార్క్సు ప్రవచనములు పండితపామరుల యాదరాభిమానములను చూఱగొనుచు ప్రచుర ప్రచారము నందుకొనినవి.

మార్క్సు ప్రవచనములు ఇంగ్లీషు, ఇటాలియన్, ఫ్రెంచి, స్పానిషు మున్నగు భాషలలోనికి పరివర్తనము చేయబడినవి. శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులు గారు ఈ ప్రవచనములను 'ఆత్మచింతనై' అను గ్రంథ రూపమున తమిళ పాఠకలోకమున కందజేసిరి.

స్వాతంత్ర్య సమరమునందే కాక సారస్వతరంగమునందు నూ సమప్రజ్ఞ ప్రదర్శించిన సవ్యసాచి శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులు గారు. వీరి యమూల్య మగు 'ఆత్మచింతనై'ని పఠించిన పిమ్మట ఈ గ్రంథమును తెనుగు చేయుట లెస్స యని తలచి యథామాతృకముగా దానిని తెనుగు చేయదొడగితిని. దాని పర్యవసానమే యీ ఆత్మచింతనము. తమ సత్కృతిని అనువదించుటకు దయతో అనుమతి యొసగిన శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులు గారికి కృతజ్ఞుడను. నా యనువాదములోని బాగోగులను నిర్ణయించుటకు సహృదయపాఠకలోకమే ప్రమాణము.

ఈ గ్రంథరచనావసరమున చక్కని సూచనలు చేసి నాకు తోడ్పడిన మిత్రులు, పండితులు నగు శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారికి కృతజ్ఞుడను.

ఈ పుస్తకము నిట్లు ముచ్చటగా ముద్రించి యిచ్చిన 'పెల్లను ప్రెస్సు' వారికి కృతజ్ఞుడను.

బుధజనవిధేయుడు,

చల్లా రాధాకృష్ణశర్మ.

# ఆత్మచింతనము

—:o:—

## ౧

ఉదయము నిద్రనుండి లేచినతోడనే యీ క్రింది విధముగా నీలో నీవు యోచించి చూడుము :

నేడు నేను కయ్యాలమ్రుచ్చును కలసికొందును. హింసాకాండను దర్శింతును. మేలు మఱచు కృతఘ్నుని సంధింతును. మట్టుమర్యాద లెఱుగనివాడు, మోసగాడు, అసూయాపరుడు—మొదలగు వారిని కలసికొందును. హితాహితములను వివక్షించు వివేకము లేమియే వారి దుష్కృత్యముల కెల్ల మూలకారణము. కాని నాకు మాత్రము మంచిచెడుగులనగా నేమో లెస్సగా తెలియును. నాకు మంచిలో సౌందర్యము కనబడుచున్నది. చెబ్బరలో అవలక్షణ మేదో యున్నట్లు స్ఫురించుచున్నది. నా కపకారము చేయదలచినవాడు కూడ నా కంటికి చుట్టముగానే యగపడుచున్నాడు. రక్తసంబంధముచే నాతడు నాకు సహోదరుడు కాకున్నను మా యిరువురిలోని యాత్మ యొక్కటియే యగుటచే మే మిద్దఱము సహోదరులమే యగుచున్నాము. మన యిరువురి హృదయములలోను భగవదంశ యంతర్యామియై యున్నది కదా! సూక్ష్మముగా పరిశీలించిననే కాని యీ సత్యము

బయల్పడదు. ఒరుడు నాకేమి యపకృతి చేయగలడు ? నేను తప్ప నితరు లెవ్వరును నన్ను చెఱుపలేరు. అపకారము చేయనెంచినవాడు నాకు సోదరు డగుటచే నతనిని కోపగించుటకాని, ద్వేషించుటకాని వాంఛనీయము కాదు.

ఈ ప్రపంచమునందు వసించు మన మెల్లరము నొక్కటిగా కూడి మనుటకే జన్మించితిమి. మన శరీరమునందలి వివిధావయవములు—కాళ్లు, చేతులు, కంటిరెప్పలు, క్రింది వరుస పై వరుసల నున్న దంతములవలె—మనము కూడ సమష్టిగా కృషి సలుపవలెను. ఈ ధర్మమును మఱచి యెవరికి వారుగా సంచరించుట ప్రకృతిధర్మమునకు విరుద్ధముగా నుండును. బయటపడక లోలోపలనే యొకనిపై పగ సాధించుటకాని, ద్వేషభావము పూనుటకాని ప్రకృతిధర్మము ననుసరించి విరుద్ధముగానే పరిగణింపబడును.

'నేను' అని చెప్పబడు నీశరీరము నిజముగా రక్తమాంసమేదోమస్తిష్కముల కలయిక తప్ప అన్యము కాదు. అందువలన ప్రతిక్షణము—ఈ క్షణమునగూడ—ఈ శరీరము నశ్వర మనియే నమ్మము. కనుక దేహ మొక పెద్ద విషయముగా భావింపకుము. దేహ మనగా రక్తమాంసకండరములతో గూడిన యొకనిర్మాణము. ప్రాణము మాత్రము? ఏమో కాదు, కేవలము గాలి. ఇప్పు డున్న గాలి మఱుక్షణములో ఉండదు. అనుక్షణము మాఱి, అది లోనికి పోవుచు వెలుపలికి వచ్చుచు నుండును.

దేహప్రాణములకు పిదప శరీరమును పరిపాలించునది మనస్సు. ఒక్కసారి యోచించి చూడుము. నీకా వయస్సు ముదిరినది. ఏల యీ మనస్సు ఇతరులకు లోగి ప్రవర్తింప వలెను? సముద్రతరంగముల నడుమ చిక్కిన తెట్టువవలె నటు నిటు ఎందుకు ఊగులాడవలెను? విశ్వములోని సోదర మానవులను గూర్చి యెట్టి యాలోచనయు చేయక నీ దుర్విధిని మాత్రమే తలచుకొనుచు నెందుకు విచారింతువు?

విశ్వశ్రేయము కొఱకే యీ ప్రపంచములో సర్వమును జరుగుచున్నవి. పంచభూతముల సంయోగవియోగములే సర్వ వస్తూత్పత్తికిని కారణభూతములు. పంచభూతాత్మకమైన మానవశరీరముల సంశ్లేషవిశ్లేషాదులు ప్రపంచవ్యవస్థకు ముఖ్యావసరములు. విధివశమున సంభవించు దైవికము కూడ ప్రపంచవ్యవస్థ కవసరమే. సర్వమును దైవాధీనము. దీనికి భిన్నముగా నొక్కయణువుకూడ జరగదు. ప్రపంచములోని యొక భాగమైన నీవు లోకహితము నుద్దేశించి జరుగుచున్న దేనిని గాని దుఃఖాత్మకముగా భావింపరాదు. ప్రపంచము నందలి సర్వవస్తువులకును సదా రూపుమాయుట, చెడుట యనునవి సహజధర్మములు. అట్లు రూపుమాయుటయు, చెడుటయు ప్రపంచమునకు ప్రాణాధారములు. ఈ సత్యమును తెలిసికొని నీవు మనశ్శాంతిని పొందవలెను. దీనినే యాధారముగా నీవు కాలము గడపవలెను. గ్రంథావలోడనము మానుము. అది నీకు తోడ్పడదు. మరణసమయమున నీవు కన్నదియు, విన్నదియు నీకు తృప్తి కూర్పవు. మున్ననుభవించిన సౌఖ్య

ములను స్మరించి దైవమునెడ నిజముగా కృతజ్ఞత పూని యుండుము. నీవు పడిన పాట్లన్నియు ప్రపంచవ్యవస్థకు తోడ్పడు సంఘటనము లని సంభావించి శాంతచిత్తుడ వై యసువులు వీడుము.

అస్థిర మైన చిత్తముతో ఎన్నినాళ్లు సంచరించితివో! ఆ విధముగా నెంతకాలము వ్యర్థమై పోయెనో ? ఆలోచించి చూడుము. ఇప్పటికైనను సరే సత్యము తెలిసికొని శాంతి పొందుము. నీవు ఒక అంగముగా నున్న యీ ప్రపంచ వ్యవస్థ యెట్టిదో కదా! ఆ వ్యవస్థను నడపించు మహాశక్తి యేది ? ఆ శక్తినుండి ప్రభవించిన యొక సూక్ష్మాంశము నీవు. నీ యధీనము నం దున్న కాలము మహాస్వల్పము. ఆ స్వల్పకాలములోనే నీ ప్రజ్ఞను మఱుగుపఱచిన తమస్సును జ్ఞానదీప్తితో రూపుమాపుము. లేకున్నచో నీ యాయుర్దాయమే యంతరించును. అటుపిమ్మట నీ కవకాశమే లభింపదు.

అభిజాతుడ వగు నీవు, మానవజన్మ మెత్తిన నీవు నీ కని విధింపబడిన కార్యమును ధర్మబుద్ధితోను, దంభ మెఱుగని యౌదార్యముతోను నెఱవేర్తువుగాక! జీవకారుణ్యము, స్వాతంత్ర్యము, న్యాయము నను నీ మూటిని నిర్లక్ష్యము చేయకుము. అందుమూలమున నీవు శాంతిని పొందగలవు. ఇది నా యంతిమకర్తవ్యము; ఇంతటితో నా ఆయుర్దాయము ముగియనున్నది —అని భావించి ప్రతికార్యమును చేయుము. బుద్ధిని అపమార్గములకు మఱలించు రాగద్వేషాదులను పరి

త్యజింపుము. కపటము, గర్వము, దైవనిరసన మున్నగు తిక్తభావములకు లోనుగాక నీ విధ్యుక్తధర్మమును సమాచరింపుము. అధర్మమునకు లొంగకుము. అప్పుడే చిత్తస్థైర్యముతో జీవితము సాగించుట సులభ మగు నని నీవు గ్రహింపగలుగుదువు.

అయ్యో! మనసా! దుఃఖాన్వేషణ చేయుచున్నావు. దీనికి అంతము లేదా? ఆత్మను సత్పథము నం దుంచుకొనుటకుగాను నీకు ప్రసాదింపబడిన కాలము ముగియును గదా! తుదిగడియలు సమీపించినవి. ఇంకను అజ్ఞానములోనే యున్నావు. నీ మనస్సు పరాధీనమై యున్నది. ఇతరుల మనోభావముల నాధారము చేసికొని జీవింప యత్నించుచున్నావు. మూర్ఖచిత్తమా!

పరలోకమునకు సంబంధించిన విషయములు నీ హృదయమును బాధించుచున్నవా? ఏదేనియు నొక సత్కార్యాచరణములో నీ మనస్సును లగ్నము కావించి బాధలను విస్మరింపుము. జీవితముయొక్క నిజతత్త్వమును గ్రహింపజాలక యేదేదో చేయుచు శాంతిని కోలుపోయి తుదకు నీ జీవితమును వ్యర్థ మొనర్చుకొనుచున్నావు. ఇది యవివేకము. నీ తలపోతలును, చేతలును ధర్మసమ్మతములై యుండవలెను. ఇది శాంతిపథము.

ఇతరుల హృదయములం దేమి జరుగుచున్నది? ఏ విషయమై వారు ఆలోచనానిమగ్నులై యున్నారు? దేనిని

గుఱించి యనాలోచితులై యున్నారు? ఇట్లు చింతించుచు మరణించుట దుఃఖహేతు వగును. నీ హృదయమును నిష్కల్మషముగా నుంచుకొనుము. అదియే సౌఖ్యప్రదము. తన మనోధర్మమును గుర్తింపక యితరులమనోధర్మములను గుఱించి చింతించు మానవునకు సౌఖ్యము లభింపదు.

కోపముచే చేయబడు దుష్కార్యములలోకంటెను ఆశచే చేయబడు దుష్కార్యములయందే పాప మధికము. క్రోధమనస్కుడు క్రోధముచేతనే యొకింత బాధావహుడగుచున్నాడు. మతివిహీను డగునప్పుడును ఆతని హృదయము బాధకు గుఱి యగుచున్నది. కాని ఆశాపీడితు డైనమానవుని కృత్యములలో మాత్రము బాధనొందుట యుండదు. ఇతరులకు దుఃఖము కలిగింపకుండ నతడు పాపకార్య మొనర్చుచున్నాడు. కనుక ఇదియే మహాపాపముగా గణింపబడుచున్నది.

ఈ విషయమును సతతము జ్ఞాపక ముంచుకొనుము. ఈ విశాలవిశ్వము పంచభూతాత్మకము. దీని లక్షణ మేమి? ఈ ప్రపంచము నందలి యొక భాగమైన 'నేను' అనుదాని లక్షణమేమి? ఈ రెంటికి గల పరస్పర సంబంధ మెట్టిది? బ్రహ్మాండస్వరూపమునకును నేను అని చెప్పబడు నీ సూక్ష్మ రూపమునకును గల సంబంధమును తెలిసికొనవలెను.

ఏ క్షణము నందైనను సరే ప్రాణము విముక్తి చెందగోరినచో అందులకు సంసిద్ధముగా సర్వవిషయములలోను నీ మనోవాక్కర్మలు సహకారులుగా నుండవలెను.

ప్రాణము పోవునప్పుడు విచారపడనేల ? మానవులను వీడి దేవతలతో నివసించుట కష్టమా ? మానవులు ఉపద్రవములు కలిగింతురు. దేవతలవలన ఆ భయములేదు. దేవతలున్నా రనుట సత్యదూరము; ఈ ప్రపంచమును వారు నడపుచున్నా రనుట దబ్బఱ — అని యనుకొన్నను అందువలన కలుగు నష్టమేమియు లేదు. భగవంతుడు పర్యవేక్షింపని లోకములో ప్రాణము వీడుట దుఃఖకారణ మగునా? కాని యిది సత్యము కాదు. ప్రపంచమును భగవంతుడే నడపుచున్నాడు. అంతేకాక దుఃఖములనుండి తప్పించుకొనుటకు తగిన సంపూర్ణ స్వాతంత్ర్యమును, శక్తియుక్తులను మానవునకు భగవద్దత్తములై యున్నవి. ముప్పునుండి బయటపడు త్రోవ యేదియో యతనికి తెలియును. ఏ విపత్తునుండి యతడు తప్పించుకొనలేడో యది యతనికి నిజముగా దుఃఖహేతువు కాదు. నిజమున కది దుఃఖహేతువే యైనచో ఆ దుఃఖమునుండి బయటపడుటకు భగవంతుడు తప్పక మార్గము నేదియో చూపియుండును. పరలోకమునకు సంబంధించిన యే విషయము కూడ బాధాకరము కాజాలదు. ఆత్మను అపమార్గములకు మఱలింపనట్టి విషయము దుఃఖకారణము కానేరదు. ఆత్మను బాధింపని విషయము

సద్విషయమే యగును. అట్టిదానిని దుఃఖహేతువని పేర్కొనుట అసమంజసము.

ప్రపంచములో మంచి చెబ్బరలతో నిమిత్తము లేకయే సర్వమానవులకును సుఖదుఃఖములు కలుగుచున్నవి. భగవంతుడు వీనిని వారింపలేకపోయెనా ? సజ్జనులకు సౌఖ్యమును, దుర్జనులకు దుఃఖమును కలుగజేయక దైవ మిట్లొనర్చెనా ? సుఖదుఃఖములును, మంచిచెడుగులును మానవుని యధీనములోనే యున్నవి. గౌరవాగౌరవములు, సుఖదుఃఖములు మున్నగునవి గుణగణములను బట్టి కాక మానవు లందఱకును సరి సమానముగా నేర్పడుచున్నవి. సూక్ష్మపరిశీలనము చేయగా వీనిలో నిజమైన మంచియు లేదు; చెబ్బరయు లేదని తేలును. విమర్శింపక ఇది మంచిది, ఇది మంచిదికాదు, ఇది సౌఖ్యావహము, ఇది దుఃఖదాయకము—అని నిర్ధరింపదగదు.

మనలో నంతర్గతమైయున్న జ్ఞానము నుపయోగించి మనము చింతన చేయవలెను. ప్రపంచము నందున్న పదార్థము లెంత త్వరితగతిని నశించుచున్నవి! మానవుని శరీరము నశించుచున్నది. నశించి పంచభూతములలో కలియుచున్నది. కొంతకాలమునకు పిమ్మట ఈ ప్రపంచమునందు దానిని గూర్చిన ప్రసక్తికి కూడ తావు లేకున్నది. ఐహిక విషయముల నిజస్వరూప మెట్టిది ? కొన్ని సౌఖ్యప్రదములను భ్రాంతిని కలిగించి యవి మానవుని తమవశము చేసికొనుచున్నవి. మఱికొన్ని మానవుని భయపెట్టుచున్నవి. కొన్ని మనలో అహంకారమును కలిగించుచున్నవి. కాని

యివి యన్నియు నిజమునకు తృణప్రాయములు, లాభరహిత ములు, నిందాయుతములు, అస్థిరములును. కీర్తియనగా నేమి? మరణమనగా నేమి? ఇవి ప్రకృతి ధర్మము లని సూక్ష్మపరిశీలనమున నెఱుఁగుదురు. ఒక సంఘటనమును చూచి బాలురు భయభ్రాంతు లగుదురు. సర్వజ్ఞులు కూడ దానిని చూచి యేల మనోవైకల్యము చెందవలెను? మరణ మొక స్వాభావికలక్షణ మని యే తలంపకుము. అది ప్రకృతిలో నూతనప్రాణు లుద్భవించుటకు తోడ్పడుచున్నది.

బుద్ధిమంతుడైనవాడు దీర్ఘముగా నాలోచింపవలసిన విషయ మిదియే. ఏ విధముగా మానవుడు భగవదంశను పొందగలుగుచున్నాడు? అతనిలో గల యే అంశము దైవిక మైనది?

సుఖము నొసగజాలని విషయములందు మనస్సును లయింపజేసి, యితరుల మనోభావములను త్రవ్వి త్రవ్వి సదా విచారించునట్టివాని జీవితము కడు విషాదకరము. చిత్తస్థైర్యమును పొంది అంతర్గత మైయున్నయాత్మను కను గొని తరణోపాయమునకై ప్రయత్నింపవలెను. ఈ విషయ మును తెలిసికొనలేక ప్రయత్నము లనేకములు చేసి మాన వుడు తుదకు విషణ్ణహృదయు డగుచున్నాడు. కామము, అవి వేకము, మనోవైకల్యము మున్నగు వానిని మనస్సులోనికి చొప్పింపకుండుటయే ఆత్మకు దోహదము చేసిన ట్లగును. విధివశమున సంప్రాప్తించు సుఖదుఃఖములు ప్రపంచపరిపాలకు

డగు భగవంతుని వరప్రసాదము లని భావించి సహర్షముగా వానిని స్వీకరింపుము. ఇతరులు మంచి చేసినను, హాని కలిగించినను—అవి యన్నియు ఆత్మీయు లొనర్చిన చేతలుగా తలంచి సంతసింపుము. ఎవరైనను నీకపకృతి యొనర్చినచో అది మంచిచెడుగులను వివక్షించు శక్తిలేనివాడు చేసిన తప్పిదమని తలచి యతనిని కనికరింపుము. గ్రుడ్డివానికి తెలుపు నలుపులు తెలియునా? ఆతనిని కనికరించునట్లుగా మంచి సెబ్బరల తారతమ్యము తెలియనివారియెడల కూడ కనికరము చూపవలెను.

మూడువేలసంవత్సరములు జీవించి మరణించినను, ముప్పదివేల సంవత్సరములు మాత్రమే జీవించి మరణించినను మరణ మనునది క్షణకాలమునకు సంబంధించిన యొక సంఘటన. దీనిని మించిన విపత్తు లేదు. గతకాలము నీది కాదు. భవిష్యత్తు నీది కాదని వేఱుగా చెప్ప నక్కఱలేదు. చేతికందనివస్తువు భ్రష్టమయ్యెనని చెప్పినచో అది అర్థరహితమగు వాక్యము. మరణమువలన కోలుపోవుకాలము వర్తమానకాలమునందలి యొక్క క్షణము మాత్రమే. కనుక అల్పదీర్ఘాయుర్దాయము లొకటే యగుచున్నవి. గతకాలము పోగా నిక మిగులునది వర్తమానకాలమే. ఇది సర్వమానవులకు నొకే పరిమాణము కలది. ఈ విషయమును తెలిసికొనవలెను. ఇక ప్రపంచములో మనము చూచుచున్న విషయము లన్నియు ప్రాతవి యగునే కాని క్రొత్తవి కావు. ఒక్క విషయమునే నూఱుసంవత్సరములు కాని, ఇన్నూరు

సంవత్సరములు కాని దర్శించినను అందు భేద మేమియు కన బడదు. కావున మరణమును గుఱించి యెందుకు దుఃఖింప వలెను ? ఆయుర్దాయమునకై ఆరాటపడనేల ?

మనము కావించు కార్యముల బట్టియే మనకు శుభాశుభము లేర్పడుచున్నవి. ఇతరములు మనల నేమియు చేయ జాలవు. వానిని మన యిచ్ఛవచ్చినట్లుగా నుపయోగించుకొను శక్తి మనస్సునకు కలదు.

కోట్లకొలది చేతనాచేతనములతో గూడిన యొక మహావ్యవస్థయే ఈ ప్రపంచము. ప్రపంచముతో సఖ్యభావమున సంచరింపకుండుట శరీరమున పుట్టిన పుండును పోలి యుండును. శరీర సంబంధమున్నను పుండు తన్నిర్మాణమున సక్రమముగా చేరక దేహమునకు బాధ కలిగించుచుండును. ఈ విశ్వమందలి జీవులతో కలసి మెలసి యుండక ప్రత్యేకముగా జీవింప నభిలషించుట ఆత్మవంచనమే యగును. ఈ ప్రపంచమునందలి యొక భాగముగా నున్న నేను నా కేర్పడు సంఘటనలను చూచి నేను దుఃఖింపగూడదు. దుఃఖించినచో ప్రపంచవ్యవస్థకు విధేయుడనుగాక దానికి విఘ్నము కలిగించిన వాడనగుచున్నాను. ప్రపంచ పరివ్యాప్తమై యున్న మహాశక్తికి ద్రోహము చేసినవాడ నగుదును. ద్వేషించుట, కోపము సాధించుట, అపకారము చేయనెంచుట మొదలగునవి ప్రపంచముతోడి సంబంధమును తెగద్రెంపులు చేసికొనుటకే తోడ్పడును. సుఖదుఃఖములవలన మనోవైక్లబ్యము చెందినచో అదికూడ ద్రోహచింతనమే యగును. కపటము,

మోసము, అసత్యము—వీనితో గూడిన మాటలును, చేతలును ద్రోహములుగానే గణింపబడును. ఫలరహితము లగు కార్యాలోచనములును, లక్ష్యరహిత మగు జీవనమును ద్రోహములే. అల్పకార్య మైనను సరే దానిని ధర్మబద్ధము గాను, సక్రమముగాను చేయవలెను. రాజాజ్ఞల ననుసరించి మనము ప్రవర్తించునట్లుగా లోకజ్ఞానముగల ప్రతిమానవు డును మార్గదర్శకము, మహోత్కృష్టము నగు ప్రపంచ వ్యవస్థలోని దైవికధర్మమునకు బద్ధుడై సంచరింపవలెను. లేకున్న తద్వ్యవస్థనెడల ద్రోహము చేసినవార మగుదుము. కావున ఆత్మవంచన కూడ నేర్పడును.

మానవుని ఆయుష్కాలములో భూతకాలమును పరి హరింపగా మిగులునది ఒక్క క్షణకాలమే. నదీప్రవాహము వలె పరుగిడి పరుగిడి తుదకు మఱుగున పడునట్టి సంఘటనయే జీవితము. హృదయాకర్షకము లైన విషయములు కూడ అస్థి రములే. మానవుని భావములు కలుషపూరితములు. నశ్వ రము లైన వస్తువులచే శరీరము నిర్మింపబడినది. నదీ ప్రవాహము నందలి యొక ఆవర్తము వంటిది మనస్సు విధిని తెలిసికొనలేము. కీర్తి క్రమరహితము. ఇది పెద్దలచే సృజింప బడునది కాదు. సంగ్రహముగా చెప్పవలెనన్న చో దేహము నకు సంబంధించినదంతయు నదీ ప్రవాహమే; లేక దేశ ద్రిమ్మరియొక్క దీర్ఘయాత్రయే. కనుక జ్ఞాన మొక్కటియే మానవునకు మార్గదర్శక మగుచున్నది. హృదయమునందు స్థిరనివాస మేర్పఱచుకొన్న దైవాంశసంభూత మైన యాత్మను

కలుషిత మొనర్పక నిష్కల్మషముగా నుంచునట్టిదే ఆ జ్ఞానము. సుఖదుఃఖముల కతీతముగా హృదయమును ఉంచునట్టిదే జ్ఞానము. ద్రోహ మొనర్పకుండుట, ఛలము చెప్పకుండుట, లాభరహిత మైన కార్యము చేయకుండుటయు జ్ఞానమే. ఏ దైవతము నాకు జన్మ మొసగెనో, ఏ ప్రకృతి వ్యవస్థ లో నే నొక భాగముగా నున్నానో ఆ దైవతమే, ఆప్రకృతియే నా సుఖదుఃఖములకు కారణ మని భావించి సహర్ష ముగా వానిని స్వీకరించుటయే జ్ఞానము. శాంతచిత్తముతో మరణము నెదుర్కొనుటయే జ్ఞానము. మరణ మనగా నేమి ? ఏ యే భూతములచే ఈ దేహము ఏర్పడెనో ఆయాభూతములుగా మఱల ఈ దేహము వేఱగుటయే మరణము. దీనిని చూచి యెందుకు మనోవైకల్యము చెందవలెను ? మన మెవరము ? భూతముల సంయోగమువలనగదా మన మేర్పడితిమి. కనుక మార్పును చూచి ఎందుకు భయపడవలెను ? మరణము ప్రకృతిధర్మము. ధర్మబద్ధ మైన విషయ మెన్నటికిని హానికరము కాజాలదు.

విధ్యుక్తధర్మనిర్వహణమునందు కాలవిలంబనము కూడదు. ఆత్మసంశుద్ధికి తోడ్పడు యత్నములందును కాల విలంబనము వలదు. ఒక్కదినము గతించె ననగా నీ ఆయుష్కాలములో నొక భాగము గతించినట్లు భావింపుము. శరీరమునకు సంబంధించినంతవఱకు జీర్ణశక్తియు, ఆశలును పూర్వమువలె నుండవచ్చును. అంతమాత్రమున కలుగులాభ మేమి ? విషయగ్రహణశక్తియు, విధ్యుక్తధర్మమును వివేక

ముతో నాచరించునట్టి జ్ఞానము నుండవలెను గదా! ఇవి వృద్ధాప్యములో క్షీణించిపోవును. ఆయువుమాత్రము చాలదు. మరణాత్పూర్వమే జ్ఞానము నశించును. గ్రాహ్యాశక్తియు నశించును. చిత్తస్థైర్యము నశించును. వివేకము తొలగును. అందువలన కార్యాచరణమునందు కాలవిలంబనము వల దనుట. కనుక తొందర పడుము.

ప్రకృతిసౌందర్యమును గ్రహించి దాని ననుభవింపుము. సౌందర్యరహితముగాను, లోపభూయిష్ఠముగాను ఉన్నట్లు పైకి గోచరమగుదానిలోను సౌందర్య మున్నది. ఎఱ్ఱగా కాలి, బాగుగా వేగిన రొట్టెలో అటనట నల్లని మచ్చ లుండుటచే ఆ రొట్టె కొక విలక్షణ సౌందర్య మేర్పడుచున్నది. అది మనకు చవు లూరించును. ఆరమగ్గిన పండు యొక్క పై చర్మము సడలిపోయి యుండుటవలన దాని కొక విశిష్టసౌందర్యము కలుగుచున్నది కదా! అది దోషమని భావించుచున్నామా? నమ్రశిరస్సులతో నమస్కరించుచున్నట్లుగా కనబడు వరికంకులలోని సౌందర్యమును పరికింపుము. అంత ఎందుకు? వన్యమృగముయొక్క ముఖమునందును, నోటిలోను, పలువరుసలయందును సౌందర్యమున్నది. కాని యివి వేర్వేఱుగా నున్నచో భయము గొలుపు చుండును. ఇవి సమష్టిగా నున్నప్పుడే వీనిలో అందచందములు దోబూచులాడుచున్నవి. ప్రకృతి రామణీయకమును గ్రహించి ముగ్ధులగువారికి సౌందర్యరహితము లగు

పదార్థములే గోచరింపవు. ప్రతివస్తువునందును ప్రత్యేకతను దర్శింపనగును. శిలావినిర్మితములైన శార్దూలవరాహాశ్వన కాదులు కన్నులకు విందొనరించునని భావించుచున్నావు. అటులనే ఆ యా సజీవమృగములందలి వివిధాంగములును సౌందర్యాత్మకములని భావింపుము. ప్రకృతిసౌందర్యము ననుభవింపగలవాడు వృద్ధాప్యమున నున్న స్త్రీపురుషులలోను అత్యంత సౌందర్యమును దర్శింపగలడు. అట్టిమానవుడు యౌవనసౌందర్యమును తిలకించినను శీలభ్రష్టుడు కాజాలడు. అమలినములైన దృష్టులను ప్రసరించి సౌందర్యమును మాత్రమే యనుభవించును. ప్రకృతిరామణీయకమును గ్రహించిన జ్ఞాని యితరులు కనుగొనని పలువిషయములను గ్రహింపగలడు.

నీ ప్రయాణము ముగిసినది. పడవనుండి దిగవలెను. దిగి గట్టెక్కుము. మరణమును కనుగొని భయపడకుము. భగవంతుని యేలుబడిలోనున్న మఱియొకలోకమునకు పోయెదవు. కావున ఎందుకు భయపడెదవు? మరణానంతరము మఱియొక లోకము లేదు; చైతన్యము లేదు; ప్రాణము లేదు—అని చెప్పినను దిగులుపడకుము. సుఖదుఃఖము లనుసాకుతో ఈ దేహము నకై తాపత్రయము చెందక అచ్చట సుఖముగా నివసింప వచ్చును గదా! చిన్మయము, జ్యోతిర్మయము నగు నాత్మ నశ్వరము, దుర్గంధపూరితము నగు శరీరమున కెందుకు అణగిమణగి యుండవలెను?

నీ ఆయుష్కాలము అత్యల్పము; దానిని వ్యర్థము చేయకుము. ప్రపంచమున కుపకరించు సత్కార్యములందు నిమగ్నుడవై నీ ఆయుస్సును సద్వినియోగము చేసికొనుము, అంతేకాని యితరులను గురించి ఆలోచనలు చేయుచు కాలమును దుర్వినియోగము చేయకుము. అత డేమి చేయుచున్నాడు ? ఇత డేమి చేయుచున్నాడు ? అతడు దేనిని గురించి ఆలోచనానిమగ్నుడై యున్నాడు ? ఎందు కతడు దానిని చేయుచున్నాడు ? కట్ట ఏ దేని పన్నుచున్నాడా ?— ఇత్యాది విచారములకు లోనయి ఆత్మ పారిశుద్ధ్యమును కోలుపోయి మనము మన తెలివి తేటలను, ఆయుఃపరిమితిని వ్యర్థ మొనర్చుచున్నాము. నిష్ప్రయోజనములగు భావసంచారమును నిరోధింపుము. అందును దుష్టచింతనములను సమూలముగా నణచివేయుము. ఉన్నట్లుండి ఒకడు 'ఇప్పుడు నీ వేమి చేయుచున్నావు ?' అని ప్రశ్నించినచో స్థిరచిత్తముతో మనస్సులో ఉన్నది ఉన్నట్లుగా 'దీనిని గురించి ఆలోచన చేయుచున్నాను' అని సులభముగా చెప్పుట కనువుగా నీ హృదయమును పరిశుద్ధముగా నుంచుకొనుము. అవాచ్యములగు తలంపులను మనసున నుంచుకొనకుము. నీ తలపోతలు పరహితకారులుగాను, నిస్స్వార్థములుగా నుండవలెను. కామము, ద్వేషము, ఈర్ష్య మొదలగు మలినభావములకు హృదయ మతీతముగా నుండవలెను.

ఈ విధముగా హృదయమును పరిశుద్ధముగా నుంచుకొని సన్మార్గవర్తి యగునతడు తనలోనే నెలకొనియున్న

భగవంతునకు భక్తుడగుచున్నాడు. అతడు బ్రహ్మపదార్థమైన తన ఆత్మను సుఖదుఃఖములనుండి సంరక్షించుకొనును. ఇతరుల తప్పు లెన్నుచును, వారి ద్వేషభావములతోను తన మనస్సును బాధించుకొనడు. ఆత్మను బాధించు కామ క్రోధాదులను జయించు శక్తిని అమలినమనస్కుడే పొందును. సుఖదుఃఖములను, మంచి చెడుగులను — ఏమి సంభవించినను సరే—సహర్షముగా స్వీకరించును. ద్వంద్వాతీతత్వమును అలవఱుచుకొనును. విశ్వశ్రేయస్సును మనసు నందుంచుకొని యితరుల మాటలను, చేతలను సరకుసేయక తన విధ్యుక్తధర్మమును గ్రహించును. మనోవాక్కర్మలను దోషపూరితములుగా చేసికొనక జాగరూకతతో మెలగును. సుఖదుఃఖాదు లగు ద్వంద్వములను సమదృష్టితో దర్శించును. జ్ఞానముగల ప్రాణులన్నియు ఏకకుటుంబమునకు చెందిన వను విషయమును విస్మరింపడు. పరహితము నుద్దేశించి పాటు పడుట మానవుని సహజలక్షణ మని భావించును. సజ్జనుల విలువను మాత్రము గుర్తించును. అధర్మప్రవర్తకుల మెఱు మెచ్చుల నంగీకరింపడు. తమ్ము తాము తెలిసికొనజాలని మతివిహీనుల పేరుపెంపులతో నాకేమిపని యని తలచి విశ్వ రూపతత్త్వమును గ్రహించి ప్రకృతితో సఖ్యజీవనము సలుపు జ్ఞానుల ఔన్నత్యమును పొందుటకు ప్రయత్నించును.

మనస్సాక్షికి విరుద్ధమైన కార్యము చేయవలదు. సాంఘికాభ్యుదయ నిరోధకముగాను, అవివేకముగాను, కలుషహృదయముతోను ప్రవర్తింపవలదు. కమనీయవచో

విలాసముతో నిజమును కప్పిపెట్టకుము. వ్యర్థభాషణము వలదు. ఇతరుల కార్యములందు వ్యర్థముగా తల దూర్పకుము. నీ హృదయములోని బ్రహ్మపదార్థమును గౌరవింతువుగాక. ధైర్యన్యాయములు కలిగిన రాజువలె జీవింపుము. ఎట్టి యాజ్ఞనైనను శిరసావహించు వీరాగ్రేసరుని వలె మరణమును స్వీకరించుటకు సంసిద్ధుడవై యుండుము. సాక్షితోగాని, ప్రమాణవాక్యముతోగాని అవసరములేని సత్యవాదిగా సంచరింపుము. ఇతరుల పొగడ్తలను కోరక స్మితవదనుడవై స్వతంత్రముగా జీవింతువుగాక! ఇతరుల సహానుభూతిని సరకుసేయక హృదయమున శాంతిని నెల కొల్పుము. ఇతరులమీద ఆధారపడక నీ కాళ్ళపై నీవు నిలిచినచో అదియే స్వతంత్రము.

లోకమున మానవున కేది నిజముగా మంచిదో యోచించి చూడుము. నీతి, నిజము, నిష్కల్మషమైన మనస్సు, ధైర్యము—వీనికంటె సుఖము నొసగునది మఱియొకటి లేదు. మనస్సును నిష్కల్మషముగా నుంచుకొని బుద్ధిమంతునివలె సంచరించుట మానవుని విధ్యుక్తధర్మము. విధి విలాసమును ప్రతిఘటించుటకుగాని, మార్చుటకుగాని ఎవ్వరి తరమును గాదు. మంచిచెబ్బరలను సమతాదృష్టితో చూచుటకు మనస్సే కారణము. మనస్సును స్వాధీనము చేసికొనిన వాడు సౌఖ్యము పొందును. దీనికంటె మఱియొకటి మహోత్కృష్టమని తోచినచో దానినేఅవలంబించుటలో తప్పు లేదు. కాని అది సరికాదు. ఏలయన మానవుని యందుండు దైవాం

శయే సర్వోత్కృష్ట మైనది. కావున మనస్సును స్థిరముగా నుంచుకొనుము. పంచేంద్రియములవలలో చిక్కకొనకయు, మనోవికారములకు లోబడకయు దైవమునకు విధేయుడ వై విశ్వకల్యాణమునకు తోడ్పడుము. ఇదియే యుత్తమవిధానము. మిగిలినవి వాంఛనీయములు కావు. ఫలరహితము లగువాంఛలను నీ మనస్సులోనికి చొప్పించినచో పిమ్మట వానిని నిరోధింపజాలవు. విశ్వశ్రేయమునకును. ఉన్నతాశయసాధనకును సహకరించునట్టి యొక సత్పదార్థము ఉండగా దానిని విడచి భోగభాగ్యాదులకై గవేషణ సలుపుట మౌఢ్యము.

"భోగలాలసుడ నైనను నేను బ్రహ్మపదార్థ మైన ఆత్మను సంరక్షించుకొనవచ్చును. ఈ భోగములు నాహృదయమును వశంవదము చేసికొనజాలవు. ఆశల నణచివైచుచు ప్రవర్తింతును." అని నీవు తలంతువు. కాని యిది అపమార్గము కానగు. ఈ ఆశలు నీకు అణగి మణగి యున్నట్లు తొలుత గోచరించినను కాలక్రమమున అవి నిన్ను జయించును. వానికి తా వొసగినచో పిమ్మట వానిని నిరోధింపజాలవు. అన్యవాంఛలకు తావియ్యక హృదయమును పరిశుద్ధముగాను, స్వతంత్రముగాను ఉంచుకొని ఏది సత్యమని కనుగొంటివో దానినే అనుసరింపుము.

సౌఖ్యావహ మైనదానిని ఎందుకు విసర్జింపవలెను ? అని కొందఱు వాదింతురు. కాని ఆలోచన చేయదగు విషయ మిది; సౌఖ్య మనగా నేమి ? కేవలము పశుప్రాయ మైనసుఖము సుఖము కాదు. మానవునకు తెలివితేట లున్నవి.

ఆ మేధాసంపదకు బాధకము కాని సౌఖ్యమే నిజమైన సౌఖ్యము. శారీరక సౌఖ్య మొసగునట్టిదే సౌఖ్య మని భావింపకుము. ఇటుల నీ మనీష నుపయోగించి నిరర్థకము లైన వానిని విసర్జింపుము. ఇటుల పరిత్యజించుటయందును గర్వము కూడదు; సవినయముగా ప్రవర్తింపుము.

సత్యమును విడనాడుటవలన శుభములే కలిగినను, అవి సంతోష మొసగజాలవు. అట్టి శుభములకై అఱ్ఱులు చాపకుము. నీ గౌరవమున కేది తక్కువగా నుండునో దానిని కోరవలదు. ఇతరులను ద్వేషించుటకో, విరోధులనుగా చేసికొనుటకో, లేక సత్యమును కప్పిపుచ్చుటకో తోడ్పడునట్టి యేవిషయమైనను నీకుసహాయకారి కాజాలదు. తెరమఱుగున ననుభవించు సౌఖ్యము లాభదాయకము కాదు. దానిని ఆశింపకుము. ప్రతిమనుజునిహృదయములోను ధర్మరక్షణోద్దేశముతో భగవంతుడు నెలకొనియున్నాడు. ఆతని ననుసరించి జీవనము సాగించువానికి దుఃఖము లేదు. అతడు సన్న్యసించి తపోభూములకు పో నవసరము లేదు. అతనికి బంధుమిత్రాదులతో నవసరము లేదు. దేనికోసము అన్వేషణ సలిపి యలసట చెందడు. దేనిని ద్వేషించియు పరుగిడడు. తన బొందెలో ప్రాణము ఉండవలయు ననియు నాశింపడు. చాలకాలము జీవించినను ఒకటే, వెనువెంటనే మరణించినను ఒకటే యని తలచును జ్ఞానసహిత మైనజీవితయాత్ర సాగించు నతనికి మరణ మెప్పుడు సంభవించినను ఒకటే. మలవిసర్జనము చేయునట్లుగా ఆతడు సహర్షముగా ప్రాణమును వీడును.

లెస్సగా పరిశీలించి యే విషయము నం దైనను నిశ్చయత్వము పొందు వివేకము నీకు గలదు. ఈ వివేకమును భయభక్తులతో నుపయోగింతువుగాక! ఇదే మానవుని సంరక్షించుచున్నది. ప్రకృతిధర్మములకును, మానవతకును వ్యతిరిక్తములగుభావములు హృదయము నం దొకతూరి కలిగినను వానిని మరల కలుగకుండునట్లు చేయున దీ వివేకమే. ప్రశాంతముగా విషయములను పరిశీలింపవలెను. సజ్జనులతో సహర్షముగాను సన్నిహితముగాను సంచరింపవలెను. దైవభక్తి యుండవలెను.

నీ జీవితములో ఏమి సంభవించినను సరే దానిని యథాతథముగాను, సక్రమముగాను పరిశీలించుశక్తిని సంపాదింపవలెను. అదియే మహితశక్తి. దేనిని చూచినను 'దీని వలన లోకమున కేమిలాభము? ప్రపంచవ్యవస్థలో దీని స్థాన మెట్టిది? మానవునకు దీనివలన కలుగు మంచిచెడుగు లెవ్వి? అని యీ విధముగా పరిశీలింపవలెను. ప్రపంచ మంతయు నొక సువిశాలరాజ్యము. లోకములో నున్న పలు దేశములును, పలు ప్రభుత్వములను అందు ఇమిడియున్న చిన్న చిన్న కుటుంబముల వంటి వని జ్ఞప్తి యం దుంచుకొనవలెను.

ఒక సంఘటన సంభవించినచో 'ఇది ఎట్టిది? ఇది ఎందువలన ఏర్పడినది? ఇది ఎంతకాల ముండును? దీనివలన నా హృదయమునందు సహనము, సత్యము, ధైర్యము, విశ్వాసము, స్వాతంత్ర్యము మున్నగు గుణము లేర్పడుచున్నవా? అని పరిశీలింపవలెను.

ఏమి సంభవించినను "ఇది దైవచిత్రము. నేతగుడ్డలోని పడుగుపేకలవలె ఇది ప్రపంచ వ్యవస్థ కనుగుణముగా నేర్పడినది. ఇది దుఃఖాత్మకమని నే నెందుకు భావింపవలెను? అని చింతించి దుఃఖోపశమనము చేసికొనవలెను. ఎవరైనను కీడు చేసినచో ఇతడు నాకులస్థుడు. నా బంధువు. నా మిత్రుడు. జ్ఞానవిహీనుడు. అతని ప్రవృత్తి ననుసరించి యాతడు ప్రవర్తించెను. నేనా అవివేకిని కాను. ఒకటిగా కూడి సఖ్యజీవనము సలుపవలె నను సామాజికధర్మమును అతడు విస్మరించినను నే నా ధర్మమును విస్మరింపగూడదు. న్యాయముగను, దయతోను నేను ప్రవర్తింపవలెను. నిజమునకు సుఖదుఃఖములే పదార్థమునందును లేవు. ఆయా వస్తువులప్రయోజనములను తెలిసికొని వానిని ఆదరింతునుగాక." అని యీ విధముగా చింతింపవలెను.

గతకాలమును గుఱించి విచారమును, భవిష్యత్తును గుఱించి దిగులును విడనాడి వర్తమానమున జరుగుచున్న కార్యములలో నీమనస్సును, బుద్ధిని, దయను చొప్పించి ధర్మబద్ధముగా జీవితము సాగింపుము. పాతివ్రత్యముగలపడతి వలె నీ ఆత్మ నిష్కల్మషముగా నుండవలెను. మరణ మెన్నడు సంభవించినను దానితో నిమిత్తములేక భగవంతునకు సమర్పించుటకుగాను నీ ఆత్మను పరిశుద్ధముగా నుంచుకొనవలెను. ఏదో యొకటి లభింపనున్న దని భావించి దానికై నిరీక్షింపకయు, దేనిని చూచినను భయపడి దానుండి తప్పించుకొనవలె ననుతలంపును మానియు దైవసాహాయ్యమున జీవిత

మును సాగింపుము. నీ మాటలలో ధైర్యము, సత్యము నుట్టి పడుచుండవలెను. అప్పుడే సుఖముగా మన గలుగుదువు; ఎట్టి సంఘటనయు నీ సంతోషమునకు అంతరాయము కలిగింపదు.

నిర్ణీతసమయమున నుపయోగించు నుద్దేశముతో శస్త్రవైద్యు డెప్పుడును తనకు కావలసిన పరికరములను పరిశుభ్రముగా నుంచుకొనును. అటులనే విధివశమున ఏర్పడు దైవికములును, మానవులచేతలును నిన్ను మార్కొనగా అప్పుడు మనోవైకల్యము చెందక వానిని పరిశీలింప సమర్థములగు నున్నతసత్యములను సహాయముగా నుంచుకొనుము. స్వల్పకార్యమునందును తోడిమానవులకును నీకునుగల అవినాభావసంబంధమును విస్మరింపక ప్రవర్తింతువుగాక! ఆసంబంధము ధర్మబద్ధమైనది. బ్రహ్మపదార్థమును తెలిసికొననిచో జీవితము సక్రమముగా సాగదు. ప్రపంచవ్యవస్థయొక్క నిజస్వరూపమును మఱచినచో పారమార్థిక ధర్మమును సరిగా నిర్వర్తింప జాలవు. ఈ రెండును భిన్నములు కావు.

ప్రపంచమంతయు నొక ప్రాణము. అందలియొకభాగమే తా ననుకొని తదనుగుణముగా జీవితము సాగించు నతనికి ఏమి సంభవించినను సరే అందుకు తగినట్లుగా సంచరింపవలె నను నాశ పొడమును. విషమపరిస్థితిలో గూడ దేశకాలవర్తమానములకు తగినట్లుగా జీవించుట అత్యంత సులభ మని యతడు గుర్తించును. అతని కీవస్తువు కావలయును; ఆవస్తువు కావలయును అని యుండదు. ఉన్నను లేకున్నను శాంతచిత్తు డగుటకు అతనికి తగినశక్తి లభించును. ఏర్పడు సంఘు

టనలు తన ఆత్మ శక్త్యభివృద్ధికి దోహదము కల్పించునట్టివే అని తలంచును. కనకనలాడు నిప్పులో ఏ వస్తువు వేయబడి నను అది ఆ నిప్పును చల్లార్పలేదు. పై పెచ్చు ఆ వస్తువు కూడ అగ్నితో కలసి జ్వాలను వృద్ధిచేయును. చిన్న మంటను ఆర్పదగువస్తువులు పెద్ద మంటను ఆర్పలేవు; ఇంకను పెద్ద మంటగా మండుటకే యవి తోడ్పడును. నీ మనస్సు కనకన లాడు నిప్పును తలపింపవలెను.

ఏకాంతవాసము నభిలషించి కొందఱాశ్రమపదమును నిర్మించుకొనుచున్నారు. మఱికొందఱు సముద్రతీరము నకు చనుచున్నారు. ఇంకను కొందఱు కొండలలోను, కాఱడవులలోను, జనసంచారములేని ప్రదేశములందును నివసింప నభిలషించుచున్నారు. నీవును అట్లొనర్చుటకు యత్నించు చున్నావు. ఇది కేవలము అవివేకము. ఎట్టివేళ యందైనను నీ వున్నస్థలముననే ఏకాంతముగా నుండవచ్చును. అశాంతి యు,సంక్షోభమును లేని ప్రదేశము కావలె నన్నచో అట్టి దానిని మానవుడు తన హృదయమునందే కనుగొనవలెను. ఏకాంతస్థలము మఱియొకచోట లేదు. శాంతచిత్తముననే సహానుభూతియు, ప్రశాంతతయు నెలకొనియుండును. అందు వలన ఆశ్రమపదసదృశమగుహృదయమునందే నీవు మౌనము వహించి మనోబలమును సంపాదింతువుగాక.

ఇట్లు ఏకాగ్రచిత్తుడవై చింతించు సమయమున పలు విషయములను నీ మనస్సున ప్రవేశింపనీయక సత్యమును గూర్చియే చింతింపుము. ఆ సత్యాన్వేషణము రాచరికపు

దుఃఖములను మఱపింపజేయును. మూర్ఖుల లౌకికవ్యవహారము లందు పాల్గొనునప్పుడు దుఃఖకరము లగు సంఘటన లేర్పడినచో వానికిని ఇదియే ఔషధము.

ఎందుకు నీవు దుఃఖింపవలెను? దురాత్ముల కృత్యములను చూచి విచారపడుచున్నావా? అట్లు దుఃఖించు సమయమున "సఖ్యజీవనము సలుపుటకే జ్ఞానసంపన్ను లగు మానవులు ప్రభవించినారు. ఒరుని తప్పులను మఱియొకడు సహించుటయే ధర్మము. అపమార్గములకు దిగునపుడు ప్రతిమనుజుడును ఆత్మ సాక్షికి విరుద్ధముగానే ప్రవర్తించును. ఇంతకు పూర్వము కోటానుకోట్ల మంది విరోధములు సాధించియు, ద్వేషములు పెంచుకొనియు, యుద్ధములు కావించియు, పిమ్మట మరణించి కాలగర్భమున కలసి పోయిరి." అని యీవిధముగా చింతించి ప్రశాంతతను పొందుము.

ఒకవేళ నీ యదృష్టమును గూర్చి తలపోయుచున్నావా? అప్పుడు కూడ ఇట్లు యోచింపుము: "ఈ ప్రపంచము దైవాధీనమా లేక భూతాత్మకమా? ప్రపంచ మొకక్రమమును పాటించు చున్నది. అకస్మాత్తుగా నేర్పడు నట్టిది కాదు ఈ ప్రపంచము.

ఒకవేళ శారీరకముగా బాధ పడుచున్నావా? శరీరము వేఱు; మనస్సు వేఱు. స్వశక్తిని గ్రహించినమనస్సు శారీరకబాధను లక్ష్యపెట్టదు. శరీరమును గూర్చియు, సుఖమును గూర్చియు, బాధను గూర్చియు ఇతరులు చెప్పగా

వినియున్నావు. వానిని గూర్చి నీవును కొంత వ్రాసితివి. వానిని జ్ఞప్తి యందుంచుకొనుము.

ఒకవేళ తుచ్ఛమైనయశస్సును గుఱించి విచారపడుచున్నావా? లోకములో పదార్థము లెంత త్వరితగతిని నశించుచున్నవో చూడుము. గతించిన యుగములా అసంఖ్యాకములు! భవిష్యత్తుకూడ గణింపశక్యము కానిదే. ఈ భూతభవిష్యత్తుల నడుమ నీ యశస్సు కేవల మొక బుద్బుదము. ఇదియే కీర్తి అనబడుచున్నది. అట్టి యశస్సు నార్జించినను అది యెంతవఱకు వ్యాప్తమగును. ఈ ప్రపంచములో ఈ భూభాగము చాల చిన్నది. ఈభూమండలములో మనము నివసించు ప్రదేశ మింకను చిన్నది. అందు ఎందఱో యున్నారు. ఎటువంటివారు నిన్ను కీర్తించుచున్నారు?

అందువలన హృదయ మనెడి నీ మానమందిరములో అదృశ్యుడవై ఆత్మచింతనముచేయుము. చంచలస్వభావుడవు కాబోకుము. వ్యర్థచింతనలు వలదు. స్వతంత్రుడవై యుండుము. ఏ విషయమై ఆలోచన చేసినను లోకమునందలి ఒకడననియు, మానవకుటుంబమునకు చెందినవాడననియు, ఎన్నటికైనను మరణింతు ననియు నీవుజ్ఞప్తియందుంచుకొనుము. ఈ క్రిందిసత్యములు మనసులో స్థిరముగా నెలకొనియుండవలెను. ఇవి నీకు లాభదాయకములు. ఒకటి: నీ ఆత్మను సుఖదుఃఖసంబంధములగు విషయములు స్పృశింపవు. అవి బాహ్యముననే సంచరించును. చిత్తచాంచల్యమునకు కారణము నీ హృదయమే. రెండు : దృగ్గోచరము లగు సకలాకృతు

లును నశింపనున్నవే. నీ కనుచూపు మేరలోనే యెన్నియో నశించినవి. మార్పు అనునది ప్రపంచధర్మము. మానవుని భావసంచయమే యాతని జీవితము.

మానవజన్మ మెత్తిన ప్రతివానికిని సర్వసాధారణముగా తెలివితేటలును, బుద్ధికుశలతయు నుండును. వివేచనా శక్తియు నాతనికి గలదు. ఇది చేయదగినది, ఇది చేయదగనిది, అను లోకజ్ఞానము కూడ మానవులలో సర్వసాధారణముగా నుండును. కావున అందఱకు నొకే ధర్మ ముద్దేశింపబడినది. ఈ హేతువుచే అందఱు నొకే ప్రభుత్వపరిపాలనమునకు లోబడిన వారగుదురు. అనగా లోకమంతయు నొక అవధికి కట్టువడి యున్నది.

ప్రకృతినుండియే నా శరీరములోని వివిధాంగములు నేర్పడినవి. ఒకవస్తువునుండి మఱియొక వస్తువు ఏర్పడుచుండును. శూన్యమునుండి ఏదియుకలుగదు. నా దేహము నందలి యొకభాగము నీటినుండియు, ఒకభాగము గాలినుండియు, ఒకభాగము అగ్నినుండియు రూపభేదములతో ఏర్పడినట్టివే. అటులనే జ్ఞానసంపన్నమైన నా హృదయము కూడ నొక మూలపదార్థమునుండి యేర్పడియుండవలెను. అదియే బ్రహ్మపదార్థము. జీవించియున్న ప్రతివస్తువును తుదకు రూపరహితముగా నశింపదు. అందువలన నాహృదయము బ్రహ్మపదార్థమునుండి యేర్పడిన యొకభాగమై యుండవలెను.

పుట్టుకవంటిదే గిట్టుటయు. ప్రకృతియందలి భూతముల సంయోగమే పుట్టుట. ఆయాభూతముల వియోగమే

గిట్టుట. దీనిని గూర్చిన విచార మనవసరము. పుట్టుకయొక్క సహజగుణమే గిట్టుట.

తమ తమ నైసర్గికగుణముల ననుసరించియే మానవులు ప్రవర్తింతురు. మఱ్ఱిచెట్టులో పాలు లేకుండనుండునా? ఆయుష్కాల పరిమితి యెంతయో? త్వరితగతిని ఎల్లరము నశించి పోవుదుము. సర్వము కల్ల యగును.

దుఃఖ మేర్పడినప్పుడు దానిని గూర్చి విచారించుట మానుము. ఏదియు నాజీవితమున కంతరాయము కలిగింపదు. అందువలన విచారించుట మానినచో దుఃఖభావము మటుమాయ మగును. ఆ తలంపు నశించినచో ఇక కష్టమునకు తా వెక్కడిది?

నా సహజగుణమును కళంకిత మొనర్ప జాలని దేదియు నా జీవితమునకు హానికరము కా జాలదు. అందువలన అది నన్నే విధముగను కష్ట పెట్ట జాలదు,

నీ కొకడు హాని తలపెట్టినచో ఆతని దుష్టభావములను నీవు మనసు నం దుంచుకొనగూడదు. నీ హృదయమునం దెట్టి దుష్టభావము కలుగజేయవలెనని ఆతడు తలచెనో ఆ భావమును నీ మనసున ప్రవేశింపనీయకుము. అప్పు డాతని దుష్టభావము నీ మనసును బాధింపజాలదు. మనోవికారము చెందక పదార్థముల నిజస్వరూపమును యథాతథముగా పరిశీలింతువుగాక!

ఈ రెండుగుణములను నీవు కలిగియుండవలెను. మొదటిది: ప్రజాసంక్షేమమును పురస్కరించుకొని స్వబుద్ధి

ననుసరించి నీవు రాజ్యాధికారము నెఱపుము. రెండవది: నీ భావము దుష్టమైనదని యితరుడు నిరూపించినచో అది సహేతుకమని నీకు తోచినచో ఆభావమును విడనాడుము. న్యాయము, సర్వజనసంక్షేమము మొదలైనవానిని మనసు నందుంచుకొని లెస్సగా ఆలోచన చేసి ఆ భావమును మార్చుకొనవలెను. అంతేకాని సౌలభ్యమును ఆశించియో, ప్రజలు ప్రశంసింతు రనియో నీ భావములను మార్చుకొనవలదు.

ఏప్రకృతియొక్క భాగముగా నీవు జనన మందితివో దానియందే నీవు అదృశ్య మగుదువు. నిన్ను కని, పెంచిన పదార్థములోనే మరల ఐక్యము చెందుదువు. అట్లయిన ఏమి?

పదివేలసంవత్సరములు జీవింతు ననుకొనుచు కాలము గడపవలదు. నేడో, రేపో—ఎన్నటికైనను—మరణము నిశ్చయమే. అది నిన్ను సమీపించుటకు వేచియున్నది. ప్రాణమున్నప్పుడే – అవకాశ మున్నప్పుడే – హృదయమును కలుషరహిత మొనర్చుకొనుము.

ఇతరు లేమని మాటాడిరి? ఏమి చేసిరి? ఏమి తలచుచున్నారు? ఈవిధముగా చింతించుచు కాలమును వ్యర్థము చేసికొనవలదు. తన్ను తాను తెలిసికొని ధర్మపథము నందున్నవానికి ఎంతో కాలము కలిసివచ్చును. ఇతరుల హృదయములలో గల దోషములను కనుగొనగోరి అందులకై అన్వేషించి ఏల విసిగివేసారిపోవలెను? నీ శ్రేయస్సు నుద్దే

శించియే అన్వేషణ సాగింపుము. ఆ నిశ్చయముతోనే అటు నిటు చూడక సూటిగా పొమ్ము.

మరణానంతరము లభ్య మగుయశస్సు నాశించి అల సట చెందవలదు. నీవు మరణించినపిమ్మట నిన్ను గూర్చి యెవ రేమి చెప్పుకొనిన నీ కేమి ? ఆ మాటలు నీ చెవిని పడవు. అవి సజీవులై యున్న వారి కే వినబడును. నిన్ను గూర్చి యేమి చెప్పుకొన్నను వారి కేమి ? అందువలన బుద్ధి నుప యోగించి, ధర్మము నన్వేషించి నీవు చేయఁవలసిన పనిని చేయుము. నీ తదనంతరము నిన్ను గూర్చి లోక మేమని చెప్పు కొనునో యని విచారపడవలదు.

ఒక పదార్థమునకు సౌందర్య మున్నచో అది దాని యందే యుండును. ఇతరుల ప్రశంసలవలన సౌందర్య మేర్పడదు. దానిని చూచి యితరు లాశ్చర్యపడుటవలన గూడ సౌందర్య ములో హెచ్చుతగ్గులు కలుగవు. కంటికి కానవచ్చు పదార్థ ములలో బాహ్యసౌందర్య మిట్లుండగా అతిలోక సౌందర్యము గల సత్యపదార్థము లైన ధర్మము, న్యాయము, సత్యము, ప్రేమ, వినమ్రత—వీనికి ఇతరుల స్తుతిపాఠము లక్కఱలేదు. ఈ సద్గుణముల యందే దైనను ఇతరుల పొగడ్తలవలన సౌందర్యాత్మక మగునా ? ఇతరులు దూషించిన మాత్రాన అవి సౌందర్యమును కోలుపోవునా? కన్నుల పండువుగొలుపు మాణిక్యము నొకడు కీర్తింపకున్నచో దాని అందచందము లకు లోపము కలుఁగునా ? బంగారము, కరవాలము, కుసు

షము, వీణ, వృక్షము—మొదలగువానిలో దేని యందము దానియందే యున్నది.

ఓ ప్రపంచమా! నీ కేది సమ్మతమో అదియే నాకును సమ్మతము. నీ కేది తరుణమో అదియే నాకును తగిన తరుణము. ప్రకృతీ! నీ వ్యవస్థయందలి దోహద కాలము లన్నియు నాకు తగిన తరుణములు. నీ నుండి సర్వ ముత్పన్న మగుచున్నవి. అన్నిటిని నీవే భరించుచున్నావు. కడపట సర్వము నీ యందే లీనమై పోవుచున్నవి. నా ప్రియమైన దేశము, నా ప్రియమైన గ్రామము అని దేశభక్తుడు నుడువుట లేదా? అటులనే యీ లోకము భగవంతుని రాజధాని యగుచున్నది.

శాంతి నభిలషించువాడు సంకల్పము లనేకములు చేయగూడదని ఒక ముని సెలవిచ్చెను. ఏది సాంఘికాభ్యుదయమున కవసరమో దానిని మాత్రము చేయుము. కార్య కలాపములను తగ్గించుకొని చేయవలసిన దానిని సక్రమముగా చేసినచో అదియే శాంతి నొసగును. మన మాటలును, మన చేతలును ముక్కాలు మువ్వీసము ఎవ్వరికిని పనికిరావు. వానిని త్యజించినచో మనస్సునకు విచారము తగ్గిపోవును. ప్రతిపనిని—ఇది ఆవశ్యకమా, అనావశ్యకమా—అని ఆలోచించి కార్యనిమగ్నుడవుగమ్ము. ఇందు వలన కాలము కూడ వ్యర్థము కాదు. అముఖ్యము లగుతలపోతలను, కార్యములను త్యజింపుము. కోరికలు నశించినచో పనులు కూడ తమంత తామే తగ్గిపోవును.

బాగుగా పరిశీలింపుము. లభించినది చాలును. లోకములో నీకని ప్రత్యేకింపబడిన భాగముతోనే తృప్తిపడుము. నీ కృత్యములు న్యాయసమ్మతములుగా నున్నచో చాలును. ఇతరులపనిపాటు లెట్లున్నను సరే, నీహృదయము మాత్రము ప్రేమపూరితమై యుండవలెను. ఇతరుల తప్పులను గణింపకుము. ఇట్లు చేసిచూడుము. సంతోషము కలుగును.

ఒకవిధముగా విషయపరిశీలనము ముగిసినది. ఇదిచాలును. ఇంకొక విధముగా పరిశీలించి చూడుము. సంశయింపవలదు. నీకు హాని ఏర్పడినమాట నిజమే. కాని అది హాని కలిగించినవానినే కదా బాధించును. నీకు కష్టము వాటిల్లినదా? అంతమాత్రమున ఏమి? ఇది ఇతఃపూర్వమే దైవనిర్ణీతము. అది నీకని ఏర్పరుపబడినది. అందువలన ఎందుకు భయపడెదవు? ఆయుర్దాయము శీఘ్రముగా ముగియును. వర్తమానకాలము నీ చేత నున్నది. దానిని సద్వినియోగము చేసికొనుము. జ్ఞానము సహాయముగా ధర్మమార్గానువర్తివై దాని నుపయోగించుకొనుము.

ఈ లోకము—దైవనిర్మితమైనను సరే, భూతముల కలయికవలన ఏర్పడినను సరే—ఏదోయొక విధముగా క్రమబద్ధముగా నేర్పడినదే. చెదరిపోయి దూరముగా పడినను అణువు లొకదాని నొకటి అనుగమించుచునే యున్నవి. క్రమబద్ధమైనయీజగత్తును పరిపాలించుసర్వేశ్వరుడు మాత్రము క్రమవిహీనుడుగా నుండునా? ఎందుల కీ విచారము.

నీ మనస్సులో ఎన్నిదుష్టభావము లున్నవి? ఎంత భయము! ఎంత నిర్దాక్షిణ్యము! పశుత్వము, సోమరితనము, లోభత్వము, ఇచ్చకము లాడుట, కాఠిన్యము—మున్నగునవి కలవు.

పొరుగూరివానికి నీ గ్రామవిషయములు తెలియవు. అటులనే ప్రపంచసంఘటనముల నంగీకరింపనివాడు ప్రపంచమునకు పరదేశీయు డగుచున్నాడు. ప్రజను సంఘటితపఱచి ఏకసూత్రమున నడిపించుచున్న సాంఘికధర్మము ననుసరింపనివాడు విదేశీయుడే యగుచున్నాడు. జ్ఞాన మను నేత్రమును మూసికొనువాడు గ్రుడ్డివాడగుచున్నాడు. సౌఖ్యావహ మగు స్వాతంత్ర్యమును విడనాడి యితరులపై ఆధారపడెడువాడు యాచకు డగు చున్నాడు. ఎందుండి మనము జనన మందితిమో అందుండి సమస్త సంఘటనలు నేర్పడుచున్నవి. ఆ సంఘటనలను ద్వేషించి ప్రపంచధర్మమునుండి తొలగిపోవు నాతడు ప్రపంచమునకు పుండు వంటివాడు. జ్ఞానము గల జీవము లన్నియు నొక మహావ్యవస్థ యై యుండగా అందుండి విడివడి నివసించు నతడు కులభ్రష్టు డగుచున్నాడు. భగవంతుని విశ్వసించి జీవితము సాగింపుము. నీకు సంభవించు నవి యన్నియు దైవమునకు చెందిన వని భావించి సంతోషముగా నుండుము. ఇతరుల యెడ నేను కుటిలచిత్తుడ నై ప్రవర్తింపలేదు; ఇతరుల స్వాతంత్ర్యమునకు భంగము కలిగింపలేదు; నే నెవరికిని సేవకుడను గాక స్వతంత్రుడ నై కాలము వెళ్లబుచ్చితిని—అని సంతోషముగా నుండుము.

ప్రపంచములో నేదియు నిత్యము కాదు. గతించిన దంతయు గాథ యగుచున్నది. అది తుదకు విస్మరింపబడు చున్నది కూడ. యశశ్శరీరులుకూడ అదృశ్యులగుదురు. ఇక నితరులసంగతి వేఱుగా నుడువ నవసరము లేదు. మనుజుడు కన్నులు మూయగానే యతనిని గుఱించి ఎవ్వరును స్మరింపరు. పేరు ప్రతిష్ఠ లనుమాటలు కూడ వ్యర్థపదములే. ఇక మనము దేనిని ఆధారము చేసికొని జీవింపవలెను. సమతాస్థితి, ఇతరులకు సహాయ మొనర్చుట, సత్యము, సహనము వీని నవలంబింపుము. ఏమి సంభవించినను అన్నిటికిని ఆదియు, మూలము నేదియో, ఆ పదార్థమునుండియే యిది యేర్పడినది, ఇది అత్యావశ్యకము—అని తలచి సంభవించిన దానిని సమ్మతితో గ్రహించుటయే నీ కర్తవ్యము.

లోకము నందలివస్తువుల ఆకృతులు మాఱి మాఱి మరల నూతనాకృతులతో అవి ఏర్పడుటను పరిశీలించి చూడుము. వస్తువిచ్ఛేదన మొనర్చి మరల వస్తూత్పత్తి చేయుటయే ప్రకృతియొక్క నిర్విరామకృషి. తొలుత దేనినైనను నాశనము చేసి దానిని బోలుమఱియొక వస్తువునుత్పత్తిచేయుటయే మహాశక్తికి వినోదచర్య. లోకమున కాననగు ప్రతివస్తువు క్రొత్తవస్తువు లేర్పడుటకు బీజ మగుచున్నది. భూమిలో మొలుచునట్టిది మాత్రమే బీజము కాదు.

తరువాతి క్షణముననే మరణింతువుగదా! అయినను మనస్సును నిష్కల్మషముగా నుంచుకొనలేదే. ఇంకను

శాంతస్వభావుడవు కాలేదు. కష్టమును గాంచినంతనే కల వరము చెందుచున్నావు. సమతాస్థితియే సౌఖ్యావహ మని యింకను గుర్తింపలేదు గదా!

జ్ఞానసంపన్నులైన మహనీయులు దేనిని నారాధించు చున్నారు? దేనిని త్యజించుచున్నారు? బాగుగా గమనింపుము.

తఱుచుగా దీనిని చింతించుకొనుచు జ్ఞప్తియందుంచు కొనుము. ఈలోక మంతయు కలసి యొకే ప్రాణము; ఒకే శరీరము, ఒకే ఆత్మ. సకల జీవరాసులును, సకలవస్తువులును కలసి మెలసి ఒక మహానిర్మాణ మగుచున్నవి. అన్నిటికిని ప్రాణము ఒకటే. ప్రతిసంఘటనయు లోకమునకు సంబంధించినదే. దృగ్గోచర మగునొక్కొక్క వస్తువు పలువస్తువుల కలయికవలన ఏర్పడును. అన్నియు నొకదానితో నొకటి కలసిపోయి దట్టముగా నేయబడిన వస్త్రమును తలపించును.

ప్రాణముయొక్క జీవితము మాత్రము? ఒక మృత శరీరము నావరించి ఆత్మ యున్నది. అంతేకదా! నశ్వరమగు దేహమున కేమి సంభవించినను అందువలన దానికి కలుగు నష్టమేమి? లోక మనగా నేమి? వేగముగా పఱుగిడు నదీ ప్రవాహము. ఏమి సంభవించినను అది కంటికి కనబడినంతనే కాలప్రవాహము దాని నెచ్చటికో తీసికొని పోవుచున్నది. మఱియొకటి దానిస్థానము నాక్రమించుచున్నది. పిమ్మట అదియు ప్రవాహమున కలసి అదృశ్య మగుచున్నది.

లోకములో సంభవించు సంఘటనములలో ఏదియు నూతనము కాదు. పువ్వులును, ఫలములును ఆయా ఋతువ్వులలో వెలసి పిమ్మట మాయ మగుచున్నవి. అటులనే ఈ సంఘటనములును. వ్యాధి, మరణము, నింద మోసము, ద్రోహము, సుఖము, సంతోషము—అన్నియు నిటులనే. వీనిని చూచి జ్ఞానులు సంతోషము చెందరు; దుఃఖమును చెందరు. రేపు మరణింతువు, లేకున్న ఆమఱునాడు మరణింతువు—అని ఎవరైనను జోస్యము చెప్పినచో రేపా, మాపా అని దానిని గుఱించి యెక్కువగా ఆలోచన చేయవలదు. రేపు మరణించిన నేమి ? కొన్ని సంవత్సరములకు పిమ్మట మరణించిన మాత్ర మేమి ?

వ్యాధిగ్రస్తుడై పడుకమీాదనున్న వానిని చూచి ఆతని వ్యాధిని నయముచేసెదమని చెప్పి ఎందఱువైద్యులు మరణింపలేదు? ఇతరుల మరణకాలములను పేర్కొను జ్యోతిష శాస్త్రజ్ఞు లెందఱో మరణించిరి? మరణమునుగూర్చియు, మరణరాహిత్యమును గూర్చియు వాదోపవాదములు నెఱపిన పండితు లెందఱు విగతజీవు లయిరి? వేలకొలదిగా జననాశన మొనర్చిన యుద్ధవీరులును మరణించిరి. తమకుమరణము లేదనుకొని దురహంకారపూరితులై ఎందఱు రాజులు ప్రజలపై నధికారము చెలాయింపలేదు! తుదకు వారి యాట లేమైనవి? ఉన్న చోటు కూడ తెలియకయే వారు మాయమైనారు. ఎన్ని మహానగరములు కలకలలాడుచు కనబడెను! అవి కూడ నశించి శవముల వలె నున్నవి. ప్రపంచమున గల ప్రతిజీవికిని

మరణమే అంతము. శుక్లరూపముగా నారంభమైన పిండము తుదకు భస్మముగా మాఱును. కనుక వీలయినంత వఱకు న్యాయముగాను, సక్రమముగాను ప్రవర్తింపుము. చెట్టున పుట్టి, చెట్టుననే పండి భూపతనము చెందుఫలమును గమనింపుము. ఎంతో సంతోషముగాను, సౌందర్యమయము గాను, సంతృప్తితోను జీవించి కడపట అది చెట్టునుండి జాఱి తాను జన్మించిన భూమిలోనే అణగారిపోవుచున్నది. దాని ననుసరింతువుగాక !

వార్ధకము వచ్చినది; మరణము సమీపించెను–అని ఎందుకు దుఃఖింతువు? ఇంకేమియు తత్త్వవిచారము వలదు. ఎన్నినాళ్లు జీవించినను తుదకుమరణము చెందుటయే తథ్యము. బాల్యమున మరణించినవారికంటె దీర్ఘకాలము జీవించి విగత జీవులైనవారు గడించిన లాభమేమి? పలువురు మరణించు టను చూచుటయేకాక వారి శవములను మోసి వానిని ఖననము చేయుటయే వారు పొందిన లాభము. అల్పదీర్ఘా యుర్దాయములకు నడుమ నున్న భేద మేమి? చాలకాలము జీవించినవారి సౌఖ్య మేమి? వార్ధకములో వారి శారీరకస్థితి యెట్లుండునో తలచిచూడుము. ప్రపంచ గమనమును వీక్షిం పుము. నీవు జన్మించుటకు పూర్వము హద్దులేనికాలము; మరణానంతరము కూడ అవధిలేనికాలమే. ఈ అనంతకాల మున మూడు నెలలే జీవించి మరణించిన .. నేమి? మున్నూఱువత్సరములు జీవించి మరణించిన మాత్రమేమి?

అలలు వచ్చి పైబడినను శిల చలింపదు. అటులనే నీ మనస్సు శాంతియుతమై యుండవలెను. మహాశబ్దము చేయుచు వచ్చి అలలు మార్కొనినను పిమ్మట నవి అణగి మణగి యుండును.

'అయ్యో! నా దౌర్భాగ్యమా! ఈ విపత్తు నాకు సంభవించినదే' అని అందువు. అట్లు కాదు నీవు తలపవలసినది. ఈ విపత్తు సంభవించినను మనోవైకల్యము చెందకయు, భవిష్యత్తునకు భయము చెందకయు ధీరచిత్తుడనై యున్నాను: నేనెంతటి అదృష్టశాలిని! ఇట్టి కష్టమెవ్వరికైనను రావచ్చును. కాని అందఱు నావలె ధైర్యముగా నుండరు. వచ్చినది విపత్తే అయినను నాకున్న మనోబలము నా అదృష్టము కదా!' అని సంతోషింపవలెను. మనుజుని హృదయమును కలుషితమొనర్పని యొకసంఘటన ఎట్లు విపత్తగును? జీవితోద్దేశము చెడనంతవఱకు ఏమి సంభవించిన మాత్రమేమి? నీ వెందుకు జీవించుచున్నావు? ఈ విపత్తువలన నీ జీవితోద్దేశముల కంతరాయము కలిగెనా? నీ సమతాస్థితికి భంగము వాటిల్లెనా? నీ పేరుప్రతిష్ఠలకు లోపము కలిగెనా? అకలంకమగు మనస్సు, వివేకము, ఆలోచన చేయుట, సత్యము, విధేయత, స్వాతంత్రత—ఈ విశిష్టలక్షణముల కేమయిన విఘాతము కలిగెనా? ఈ లక్షణములుగల మనుజునకతని చిత్తశుద్ధియే సౌఖ్యదాయకము. ఎట్టి విపత్తు కూడ నిజమునకు హానికరము కాదు. దానిని సహించుశక్తిని కలిగియుండుటయే మహాద్భాగ్యము. దీనిని జ్ఞప్తియందుంచుకొనుము.

ప్రాతఃకాలమున మేల్కొనక శయ్యాగతుడ నై యుండుటకే ఎందుకు కోరుచున్నాను? చలికి భయపడి శాలువు కప్పుకొని పడుకపై నిద్రించుటకా నేను జీవించి యున్నాను? ఉద్దిష్టకార్యము నాచరించుటకుగాను ఒకదినము నీ జీవితకాలమునకు కలుపబడినట్లుగా తలచి నీవు త్వరగా మేల్కొనవలెను గదా?

తల్పముపై శయనించుట సౌఖ్యప్రద మని తోచు చున్నది. కాని సుఖముగా నుండుటకా నీవు జనన మందితివి? నీ కర్తవ్యము నాచరించుచున్నావా? లేక సంభవించు సంఘటనములకు కేవలము నిమిత్తమాత్రు డవుగా నుండుటయే నీ జీవితోద్దేశమా? నీ పరిసరముల నున్న చెట్టు చేమలను చూడుము. పిట్టను చూడుము. కీటకమును కనుగొనుము. ఈగను పరికింపుము. అవి తమతమపనులను చేయుటను గమనింపుము. జీవరాసులలో ఒక్కొక్కటియు ఇతరుల యుపదేశము లేకయే తమధర్మములను ఎట్లు నిర్వర్తించుకొను చున్నవో తిలకింపుము. నీ కర్తవ్యమును నీవు చేయవలదా? విశ్రాంతి వలయును గదా అని అడుగుదువు. విశ్రాంతి కావలసినదే. కాని అందుకు గూడ మిత మున్నది. అన్న పానములకు ఆకలిదప్పులు సూచికాప్రాయములు. మితిమీరి భుజించుటయు, త్రాగుటయు వలదు. అటులనే విశ్రాంతికి గూడ ఒక మితి యున్నదికదా! కర్తవ్యాచరణము నందు నీ సర్వశక్తిని వినియోగింపవు. విశ్రాంతి తీసికొనునప్పుడు మాత్రము వలసినదానికంటె ఎక్కువ తీసికొనుచున్నావు.

మనస్సునకు శాంతి నొసగజాలని యే వస్తువు నైనను త్యజించుట నిజమునకు సులభము. మనశక్తిని మనము తెలిసికొనలేకున్నాము. నీకు బుద్ధికుశలత లేదు. అందుకై యిప్పుడు చేయదగినది ఏమియు లేదు. కాని నీలో మఱికొన్ని విశిష్ట గుణములు కలవు. వాని నాధారముగా చేసికొని జీవితము సాగింపుము. నిజమైనజీవితమును సాగించుట, సచ్ఛీలసంపాదనము, ఉదాత్తభావములను కలిగియుండుట, శారీరక బాధల నణచివేయుట, భోగములను త్యజించుట—మొదలగునవి నీ శక్తికి మించిన కార్యములు కావు. వీనిలో ఏదియు నీచమైనది కాదు. అసంతృప్తితో జీవింపు మని నిన్నెవరైనను నిర్బంధము చేయుచున్నారా? మోమోటముగా మాటాడు మని నిన్నెవరైనను బలవంతపెట్టుచున్నారా? వట్టిగొప్పలను గుఱించి భాషింపు మని ఎవరైనను నిన్ను బాధించుచున్నారా? జన్మతః నీ కెట్టిలోపమును వాటిల్ల లేదు. నీలో లేని బుద్ధికుశలతను బడయు మని నిన్నెవ్వరును కోరలేదు. కాని యితర విషయములలో నీకర్తవ్యమును ఏల నిర్వర్తింపలేదు? అభ్యాసవశముగా పొందదగిన సూక్ష్మబుద్ధిని పొందుటకు ప్రయత్నించితివా? ఉపేక్ష వహించుట నీ దోషమే.

దారువు, లోహములు మొదలగువాని నుపయోగించు వడ్రంగియు, కమ్మరియు తమ తమ పనిపాటులమీఁది మోహముచే అన్నపానాదులను గూడ విస్మరించి తమ పనులలోనే మునిగి తేలుచుందురు. అగసాలికి స్వవృత్తి యం

దభిలాష మిక్కుటము. అతడు తయారుచేయు వస్తువు కంటె ఎంతో ఉత్కృష్ట మగునీ మనోనైర్మల్యము నందు అతనివలె నీ కభిలాష లేదేమి! నటునకు తన అభినయము నందుండు ఆసక్తిలో కొంతయైనను నీ మంచిలో నీకు ఆసక్తి కనబడదేమి? లోభికి ద్రవ్యాశ మెండు; స్తుతి పాఠకునకు పరస్తుతి యందాశ అగ్గలము. వారివలె నీకు కొంచెమేనియు నీ ధర్మనిర్వహణములో నమ్మకము లేదు. తమ పనులలో గల మమకారముచే వారు నిద్రాహారము లను గూడ మఱచి తమ వాంఛితార్థములను బడయుటకు యత్నింతురు. మఱి నీకు మాత్రము నీ ధర్మనిర్వహణము ముఖ్య మని స్ఫురింపలేదు కదా!

ఇతరునకు ఏదేని ఉపకారము చేసినచో దానిని మనసు నం దుంచుకొని కొందఱు ప్రత్యుపకారమును కోరు చుందురు. మఱికొందఱు ప్రత్యుపకారమును కోరకున్నను ఆ విషయమును విస్మరింపక సహాయముపొందిన వానిని ఋణ స్థునివలె భావింతురు. కాని కొందఱు తాము చేసిన సహాయ మును సంస్మరింపరు. పరువమున మధురము లగుపండ్ల నొసగి పిమ్మట ద్రాక్షలత ఆ విషయమును మఱచిపోవును. గుఱ్ఱము పరుగిడుటయు నిటులనే. జాగిలము కూడ నీ రీతిగనే వేటకు పోవును. తేనెటీగయు తేనెను సేకరించుట యిటులనే. తాను సృజించిన ఫలములను గూర్చి మరల మరల చింతిం పని ద్రాక్షవలె మానవుడును ఫలము నుపలక్షించి సహా యము చేయరాదు. మరల పరువమున పండ్ల నొసగు

ద్రాతువలెనీవును తిరిగి ఉపకారమొనర్చుటకుయత్నింపుము. వ్యాధిగ్రస్తునకు ఔషధమును, పథ్యమును వైద్యుడు నిర్ణయించునట్లుగా దైవము మానవులకు కష్టములు కలిగించును. వ్యాధి యేర్పడుట, అంగవైకల్యము కలుగుట, వస్తువు భ్రష్టమగుట—ఇట్టిసంఘటనము లన్నియు విశ్వరూపు డగుభగవంతుని నిర్ణయము లని భావింపవలయును. వ్యాధినికుదుర్చుటకై వైద్యుడు చెప్పు పథ్యపానములు బాధాకరములై యుండవచ్చును. అటులనే ప్రపంచగమనము నుద్దేశించి సంభవించుచున్న దైవనిర్ణయములు మానవునకు దుఃఖములవలె కన్పట్టును. ప్రపంచ మంతయు నొక శరీరము. సర్వమానవుల శరీరములు కలసినచో ప్రపంచ శరీరమగును. సర్వకార్యకారణములును ప్రపంచమునకు కార్యకారణములగుచున్నవి. అదియే లోకము. అదియే నీవు తలచునట్టివిధి. విధిని ద్వేషించుట ప్రపంచవైద్యుడు ప్రపంచమునుద్దేశించి విధించు పథ్యపానములను నిరసించుటయే యగును. వివేకవంతుడు వైద్యుని సలహాలను సహర్షముగా స్వీకరించినట్లు నీవు విధిని అంగీకరింపవలెను. మందు చేదుగా నుండును. పథ్యము బాధాకరముగా నుండును. అయినను వ్యాధి కుదురు నను నభిలాషతో వానిని మన మంగీకరించుచున్నాము.

శరీరమున అంకురించు వ్యాధిని రూపుమాపి తత్సంరక్షణము నెట్లు కోరుచున్నామో, అటులనే ప్రపంచమును జీవమహితముగా సంభావించి తత్ శ్రేయమును గూడ కోరుము. దుఃఖముగా తోచినను విధి నిర్ణయమును సహర్షముగా స్వీక

రింతువు గాక! అది విశ్వశ్రేయము నుద్దేశించి ప్రకృతి తయారుచేసిన ఔషధము.

కావున నీ కేమి సంభవించినను మనోవైకల్యము చెందక నీవు దానిని స్వీకరింపుము. ఇట్లొనర్చుటకు రెండు కారణము లున్నవి. మొదటిది : ఇది నీ కని యేర్పరుపబడిన సంఘటన. నీ ప్రాదుర్భావమున కే కార్యకారణ పరంపర సహాయకారి యయ్యెనో అం దుండియే ఆ సంఘటనయు నేర్పడినది. కనుక దానిని సంతోషముతో స్వీకరింపుము. రెండవది: సర్వ జీవరాసుల సంక్షేమము నుద్దేశించి యేర్పడు చున్న సంఘటనములు కొందఱకు బాధాకరములుగానే తోచును. ఈ ప్రపంచ మందలి యొక భాగమున కేదేని లోపము వాటిల్లినచో దాని సౌందర్యమునకు గూడ లోప మేర్పడును. ప్రపంచ వ్యవస్థలో సంభవించు నొక విషయ మును గుఱించి నీవు అతృప్తి చెందుట సమంజసము కాదు. అందువలన ప్రకృతిధర్మమున కంతరాయ మేర్పడగలదు.

ఎప్పుడైనను ధర్మచ్యుతుడ వైనచో పతితుడ నైతి నని తలచి నీ ప్రయత్నమును విడనాడవలదు. మరల ధర్మ పథమును చేరుకొందువుగాక! 'సజ్జనునివలె జీవితము సాగించి తిని; నేను భాగ్యశాలిని'—అని సంతోషింతువు గాక. విసుగు కొనుచు పాఠశాలకు పోవు బాలురవలె అపమార్గమున నున్నప్పుడు నీవు సంచరింపవలదు. నేత్రవ్యాధితో బాధపడు నతడు చల్లనిమందులను కండ్లపై వేసికొనునట్లును, గాయపడినవాడు గాయమునకు కాపు పెట్టుకొను నట్లును,

నీవు సంతోషముతో ధర్మపథము ననుసరింతువుగాక; మన శ్శాంతిని పొందుటకు జ్ఞానమును సముపార్జింపుము. ఇతర ములు మానవునకు సౌఖ్య మొసగ జాలవు.

జ్ఞానము, జడత్వము—ఈ రెంటివలన నే నేర్పడితిని. ఈ రెంటిలో నేదియు నామరూపములు లేక నశింపదు. శూన్యమునుండి యేదియు నేర్పడ లేదు. కనుక ఏదియు శూన్య మగుటకు వీలు లేదు. ఈ శరీరమునందలి ప్రతిభాగ మును వేఱొక పదార్థమున చేరి ఉపయోగపడు చున్నది. మరల అది మార్పు చెంది యింకొక పదా ర్థమున కలియును. ఇట్లు అనంతకాలము అది ఉప యోగపడుచునే యుండును. ఇటుల నేకదా నేను అను ఈ దేహమును, ప్రాణము మఱియితరములు నేర్పడినవి. వేర్వేఱు రూపములతో అవి మరల మరల అవతరించుచునే యుండును. ప్రళయకాలము లందు లోక మంతయు నశించు నని తలం తువు. అనగా సర్వాకృతులు నొక యాకృతి యై దాని నుండి మరల లోక ముద్భవించుచుండును.

కనుక ఇది సత్యదూరము కా జాలదు.

మన యిష్టానిష్టముల కనుగుణముగా ధర్మశాస్త్ర ములు తమధర్మములును మార్చుకొనలేవు. అవి తమధర్మ ముల ననుసరించియే సాగిపోవును కావున ఋజుప్రవర్తన మనునది ధర్మజీవనమునకు నామాంతరము. ధర్మచ్యుతు డవుకాక, ధర్మ మార్గానువర్తి వై సంచరించుట యే నీ ధర్మము

ఒకనియొద్ద నున్న వస్తువులతనివే యని నుడువుట పొరపాటు. ఎందుకనగా ఆ పదార్థము అతని అంత స్తత్వము నందలి యొక భాగమై యుండవలెను. పదార్థములను ద్వేషింపవలదు; ఆశింపనువలదు. మానవుని హితాహితములు అందుండవు. మనోవైకల్యము చెందక భౌతికములను పరిహరింప గలుగువాడు తరణోపాయమును కనుగొనుచున్నాడు. భౌతికములను త్యజించు నప్పుడును, ఇతర కారణములచే అవియే అతనికి దూర మగునప్పుడును అతని మనస్థితి చలింపకున్నచో అట్టి నిగ్రహామే ముక్తిమార్గమునకు సోపాన మగును.

వేసికై నీవు విరామరహితముగా చింతించుచున్నావో వాని లక్షణములే తుదకు నీ మనస్సునకు సంక్రమించుచున్నవి. రంగుగుడ్డను నీటిలో వేయగా ఆరంగులో మార్పు కలుగునట్లుగా, మనస్సు నందలి భావములందు హృదయము క్షాళనము కాషింపబడినప్పుడు అది వివర్ణము చెందును. అందువలన ప్రాణమున్నంతవఱకు ఆదర్శప్రాయమగుజీవితము సాగింతును గాక అని తలచుచుండుము. ఎట్టి స్థితిలో నున్నను దివ్యజీవనము చేయవచ్చును. సృజింపబడిన వస్తువున కనుగుణముగానే దాని సహజస్థితియు నుండుటచే అది వర్ధిల్లుచున్నది. అదియే దాని ధర్మము. కనుక లోకజ్ఞానమును పురస్కరించుకొని కాలము గడపుటయే జ్ఞానవంతుడగు మానవుని కర్తవ్యము. ప్రాణరహితము లగు వాని కంటెను ప్రాణముగలవి శ్రేష్ఠములు. ప్రాణ మున్నవానిలో జ్ఞానముగలవి శ్రేష్ఠతములు. జ్ఞానముగల ప్రాణుల యుపయోగార్థమే

ప్రాణరహితములు సృజింపబడినవి. జ్ఞానముగల మానవులు ఒకరి కొకరు సహాయము చేసికొనుచు సఖ్య జీవనము సాగించుటకే జన్మించి యున్నారు.

కాజాలని యొకకార్యమునకై అట్టులు చాచుట తెలివితేమి యగును. అందువలన దుర్జనులు తమ సహజ స్వభావమునకు విరుద్ధముగా సంచరింప రని భావింపుము.

ఏ స్థూలపదార్థము వలనగూడ ఆత్మ బాధింపబడదు. ఆత్మను అది సమీపింప లేదు. దానివలన ఆత్మ చలింపదు; ప్రవర్తింప బడదుకూడ. ఆత్మ యొకరియధీనమున లేదు. అది తన్ను తానే ప్రవర్తింప జేసికొనుచున్నది. బహిర్వస్తువులను గూర్చియు, సంఘటనలను గూర్చియు మన హృదయములలో సంచరించుచున్న అభిప్రాయములే ఆత్మను బాధించుచున్నవి. అంతేకాని బహిర్వస్తువులు దానిని బాధింప జాలవు.

సత్కార్యము లొనర్చుటయు, ఇతరులకృత్యములను సహించియుండుటయు జ్ఞానవిశిష్టుడైన మానవుని కర్తవ్యములు. ఈ ధర్మము ననుసరించునంతవఱకు మనుజుడు మనుజుడుగా నుండును. మన విధ్యుక్తధర్మములకు విఘ్నములు కల్పించుమనుజులు జడపదార్థములవంటివారు. వారిని శీత వాతాతపములతోను, దుష్టమృగములతోను పోల్చవచ్చును. వారిదుష్కృత్యములు నామనోనిగ్రహమునకుగాని, నాసహజ ప్రకృతికిగాని బాధాకరములు కాగూడదు. జడపదార్థములు కల్పించు నంతరాయములను చూచి మానవుడు వానిని ద్వేషింపగూడదు. అటులనే విఘ్నములు కలిగించు మాన

వులను గూడ ద్వేషింపగూడదు. అటంకములకు తగినట్లుగా ప్రయత్నములను మార్చుకొనుచు మార్గాంతరము లన్వేషించి లక్ష్యమును సాధించుకొనదగు మహత్తరశక్తి నాలోనున్నది. ఎట్టి విఘ్నము నైనను సాధనముగా చేసికొని విజయము సాధించుశక్తి ఆత్మకు కలదు.

పరాశక్తియందలి ప్రత్యేకత ఎట్టిది? సర్వపదార్థములను కైవసము కావించుకొని వానిని తన పరిపాలనలో నుంచుకొను ప్రతిభా విశేషమే ఆమెయందలి ప్రత్యేకత. అటులనే నీ యందును విలక్షణమైనశక్తియున్నదేమో పరికింపుము. నీ మనస్సును పరిపాలించుశక్తియు, లోకము నేలుచున్న శక్తియు నొకే వర్గమునకు చెందినవి. అవి విభిన్నములు కావు. విశ్వము నందలి సకల పదార్థములను తనవిగా చేసికొని వాని నుపయోగించుకొనుచున్న బ్రహ్మపదార్థము నీలోను నున్నది కదా! అదియే నీ శారీరక ధర్మములను ప్రవర్తింపజేయుచున్నది.

గ్రామమునకు హానికరము కానట్టిది గ్రామస్థునకును హానికరము కాజాలదు. ప్రతివిషయమునందును ఈ సత్యమును మనస్సు నందుంచుకొనుము. నా గ్రామమునకు దీనివలన హాని సంభవింపదు కదా! అట్లయినచో నే నేల దుఃఖం పవలెను? ఒరునివలన గ్రామమునకు ముప్పు వాటిల్లినచో అతడావిధముగా చేయుటకు కారణ మేమి? ఆత డేవిషయమును అపార్థము చేసికొనెను?—అని ఆలోచింపుము. అంతే కాని అతనిని కోపగించుట లాభదాయకము కాదు.

పదార్థము లెంత త్వరితగతిని నశించి మటుమాయ మలగుచున్నవో గమనింపుము. ప్రపంచమే నదీప్రవాహము వలె పరుగిడుచున్నది. ఏదియు నిత్యముకాదు. ఎన్ని మార్పులు! ఎంత వేగము! మనయునికి ఎట్టిది? గతించిన కాలమా అనాదియు; అవధిలేనిదియును; భవిష్యత్కాలమునకా హద్దులేదు. అందు సర్వము విలీనమై మటుమాయమగును. ఈ అనంతకాలము నడుమ ఏదోయిడుమ సంభవించెనని దిగులుపడుచున్నాము; దురపిల్లుచున్నాము. పూర్వాపరములందు ఆద్యంతములు లేని యీ అనంత కాలమున అప్పుడప్పుడు సంభవించు కష్టములను గుఱించి విచారించుట ఎంత అవివేకము!

ఎప్పుడును జ్ఞప్తి యందుంచుకొనుము. సర్వవ్యాపకమైన యొక పదార్థము నందలి చిన్న భాగమే నీవు. అనంతములైన యుగములందు నీ ఆయుర్దాయ మొక క్షణకాలము మాత్రమే. వీనిని జ్ఞాపకముంచుకొన్నచో నీ కేర్పడు దుఃఖములను నీవు గణింపవు. అప్పుడే సమతాస్థితిని పొందెదవు.

ఒరుడు నా కపకృతి చేయనెంచెనా? అది అతనికే కదా దుఃఖహేతు వగుచున్నది. ఇతరుని దుష్కృత్యములు న న్నేమి చేయగలవు? అవి వారి మనోవికాసమును, వారి ప్రయత్నములను ప్రతిఘటించును. వానివలన మంచియో, చెబ్బరయో వారికే కలుగును. అట్టి సమయములలో ఏమి చేయు మని నా ఆత్మ నన్ను ప్రబోధించునో అటులనే నే

నాచరింతునుగాక. ప్రపంచమును నడుపుచున్న ఆ సర్వేశ్వరుడు దేనిని నా కనుగ్రహించుచున్నాడో దానినే నేను పొందుచున్నాను. కనుక ఇతరుని దుష్కృత్యములు నన్ను ప్రతిఘుటింపజాలవు.

---

దేవతలలో నొకడవై జీవింపుము. ప్రతిమానవుని మనస్సునందును దైవాంశ నెలకొనియున్నది. అదియే మనకు జ్ఞానము నొసగుచున్నది; మార్గ దర్శక మగుచు మనలను సర్వకాలసర్వావస్థలయందును సంరక్షించు చున్నది. జీవిత మున సంభవించుదానిని సహర్షముగా స్వీకరించి సర్వ కార్యములందును మనస్సునందున్న దైవతము చూపు త్రోవలయందు చనుట మానవుడు దేవతలతో నివసించుట యగును.

సఖ్య జీవనము సలుపుటయే ప్రపంచధర్మము. సృష్టిలో నొకదాని కొకటి యుపయోగపడునట్లుగాను, ఒకదానియం దొకటి విలీన మగునట్లుగాను సర్వ వస్తువులు సృజింప బడియున్నవి. ఉన్నతశ్రేణికి చెందిన మనము ఒకటిగా కూడి సఖ్యజీవనము సలుపుటకే జన్మించితి మని నీవు తెలిసికొన వలెను.

నీ హృదయమును నీ వడుగుము. ఇదివరలో నీ వెట్లు సంచరించితివి? దైవము, మాతాపితరులు, సహోదరులు, భార్యాపుత్రులు, బంధుమిత్రులు, గురువులు, పరిచారకులు- వీరందఱియెడల ఎటుల మెలగితివి? నే నెవరికిని అన్యాయము చేయలేదు. దూషణోక్తుల నుపయోగించి యుండలేదు.— అని నిజముగా నుడువ నీ లగునా? అట్లు ప్రవర్తించితివా? ఇంకను నీ గత చరిత్రను స్ఫురణకు తెచ్చుకొనుము. ఎంత

వఱకు సహనమును ప్రదర్శింపగలిగితివి? దు:ఖమును గణింపకయు, సుఖము నాశింపకయు సమతాస్థితియందే ఉంటివా? ఎంతవఱకు అట్లుండగలిగితివి? ఎచ్చట తప్పటడుగు వేసితివి? ఆశ లెన్నిటిని త్యజించితివి? ఇతరులు నీకు హాని యొనర్చినను వారి కుపకారము చేసి ఋణవిముక్తుడ వైతివా? ఇట్లెన్ని మారులు చేసితివి? నీ యైహికజీవితము ముగియ నున్నది. వీనిని లెక్కింపుము.

పంచేంద్రియము లభిలషించు సౌఖ్యములు అస్థిరములు. వానివలన పొందదగిన జ్ఞానము సంశయాత్మకము; దోష పూరితమును. ప్రాణము మాత్రము ? రక్తప్రసారమే కదా! కాగా ఎందు కీలోకమున జీవింపవలెను? శాశ్వతకీర్తి సముపార్జనకా? అనిత్యము, అజ్ఞానయుతము నగు నీ లోకములో యశస్సు మాత్ర మేపాటిది? జననమో, మరణమో— ఈ రెంటినడుమ నీ కర్తవ్య మేమి? దేవతల ననుసరించుట, వారిని స్తుతించుట, మానవులకు సహాయము సలుపుట, ఇతరుల దోసగులను సహనభావముతో స్వీకరించుట, చేయదగనివానిని చేయకుండుట, ఆత్మనిగ్రహమును సాధించుట — మున్నగునవి నీ కర్తవ్యములు. స్వల్ప మగునీ శరీరమును, ప్రాణమును నీవి. తక్కిన వన్నియు నీ స్వాధీనమున లేవు. కనుక నీ విచారమునకు హేతువు లేదు.

నీ తలంపులును, చేతలును దోషరహితము లై యున్నప్పుడును, నీవు ధర్మమార్గానువర్తి వై యున్నప్పుడును నీ జనుత్రోవ కూడ సుగమముగానే యుండును. ఆత్మను శాం

తింపజేయు నుపకరణము హృదయమునకు వెలుపల నేదియు లేదు. సమతాస్థితి యందుండు నీ తలపోతలును, చేతలును ఆత్మకు సంతోషము నొసగును. అంతకంటె ఆత్మకు కావలసినవి మఱియితరములు లేవు.

ఇది నే నొనరించిన దోషమా? లేక మత్కృత దోష ఫలితమా? ఇది సాంఘికజీవనమునకు సౌఖ్యప్రదమా? సౌఖ్యరహిత మగు దీనిని గూర్చి నే నేల కలవరము చెందవలెను?

కర్తవ్య నిర్వహణమునందు ఎండవానలను సరకు సేయవలదు. నిద్రను గూడ సరకు సేయకుము. ఇతరుల ప్రశంసలను, ప్రోత్సాహమును లక్ష్యము సేయకుము. ప్రాణము పోవుటను గూడ గమనింపకుము. మరణము చెందుట కూడ మానవుని కర్తవ్యములలో నొకటియే. ప్రాణపరిత్యాగమును గూడ సక్రమముగా నిర్వర్తింపుము.

దేని నైనను పరిశోధించి చూడుము. ప్రతిదాని యందును ఒక విశిష్టలక్షణ ముండును. పదార్థము లందు మఱుగుపడిన మంచిని విడిచివేయుట కడు సులభము. అట్టి దోషమునకు నీవు తావీయవలదు.

ఇతరులు నీకు హాని తలపెట్టినచో అందులకు ప్రతిక్రియ వారికి హాని చేయకుండుటయే.

ఎల్ల వేళలయందును భగవంతుని మనసున నుంచుకొని, పరోపకారము చేయుచు జీవింపుము. సంతోషము కాని, మనశ్శాంతి కాని లభింపవలయునన్నచో ఇది యొక్కటే మార్గము. లోకముతో సహకరించుచు, నితరులకు సహాయ

షము సలుపుచు నివసింపుము. ఒకపని ముగిసిన పిమ్మట మఱి యొక దానిని చేపట్టుము. లోకజ్ఞానమును పురస్కరించుకొని నిర్విరామముగా కృషి యొనర్చుట యే సంతోషప్రదము. అదియే విశ్రాంతి.

అసంతృప్తి ఎందుకు? ప్రకృతి వ్యవస్థ కనుగుణముగా ప్రవర్తించుటకే ప్రతివస్తువు సమ్మతించును. అది కాక దానికి అన్యమార్గ మేది కలదు? ఏ యితర ధర్మ సూత్రమునకును పదార్థములు లోబడియుండవు.

లోకము జ్ఞానరహిత మైనఅణువులకలయికవలన ఏర్పడి యుండవచ్చును. లేదా దైవమునకు వశంవదమై క్రమమును, శఖ్యతను పాటించునట్టిదిగానైన నుండవచ్చును. ఈ లోకము దైవాధీనమున లేదనియు, క్రమరహిత మనియు, ఉపయోగరహిత మనియు తలచినచో ఈ లోకమునందే యింకను జీవింపవలయునని ఎందుకు ఆశించుచున్నావు. ఇది యెప్పుడు భస్మీభూత మగు ననుచింత తప్ప అన్యములను గూర్చి విచారింపకుము. ఈ విషయమును గుఱించి కూడ చింతించుట మానుము. నే నేమి చేసినను, చేయకున్నను తుద కీశరీరము బూదిగానో, మన్నుగానో మార్పుచెందు ననుట నిశ్చయము.

అట్లు కాక దైవ మున్నాడు, ఒక క్రమ మున్నది, ప్రకృతి వ్యవస్థ కలదు – అని తలచినచో ప్రపంచ పరివర్తకు డగునా దైవతము నెడ భక్తివిశ్వాసములు ప్రకటించి ప్రశాంతతను బడయుము.

సంభవించిన సంఘటనలవలన నీహృదయమున ప్రశాంతత భగ్నమైనచో మరల త్వరితగతిని హృదయము ప్రశాంతముగా నుండునట్లు చేసికొనుము. ఈ సందర్భమున ఒక్క క్షణమైనను జాగు సేయవలదు. ఇట్లొనర్చుచున్నచో క్రమక్రమముగా అది అలవాటుగా మాఱిపోవును. అప్పుడు గాని హృదయము ప్రశాంతముగా నుండదు.

నా తలంపులుగాని, చేతలుగాని దోషపూరితము లని ఇతరులు తెలివిడి చేసి నాకు జ్ఞానోదయము కలిగించినచో వెంటనే నేను వానిని త్యజింతునుగాక! దోషమును తెలియజేసినవానికి నేను కృతజ్ఞతను తెలియజెప్పుదునుగాక! నేను సత్యమునే అనుసరించుచున్నాను. ఏకాలమునందుగాని సత్యమును చేపట్టినందువలన బాధపడిన వా రెవ్వరును లేరు. సత్యమును త్యజించియు, అజ్ఞానమున సంచరించియు, ఆత్మవంచనము చేసికొనియు జీవించువాడే పతితు డగును.

నేను నా కర్తవ్యమును ముగింతునుగాక! ఇతర విషయములందు నేను విముఖుడనై యుందునుగాక! నా ప్రయత్నముల కేర్పడుచున్న అంతరాయములను ద్వివిధముగా వింగడింపవచ్చును. జ్ఞానరహితము లగువస్తువులవలన కొన్ని అంతరాయము లేర్పడును. జ్ఞాన విశిష్టులైనమానవులలో అధర్మప్రవర్తకులవలనను, జ్ఞానవిహీనులవలనను కొన్ని అంతరాయము లేర్పడుచున్నవి. ఎవరియందును కోపము వహింపకుము.

అచేతన పదార్థముల యెడలను, వివేకశూన్యులైన వారి యెడలను జ్ఞానవిశిష్టుడవైన నీవు ఉదారముగా సంచరింపవలెను. తోడిమానవులతో సఖ్య సహకార భావములతో మెలగుము. సర్వ విషయములందును సర్వేశ్వరుని విశ్వసించి ప్రవర్తింపుము. ఇట్లెంత కాలము చేయగలుగుదునా యని చింతింపకుము. ఏడున్నర ఘడియ లిట్లు ధర్మపథమునకు భిన్నముగా గాక సంచరించిన చాలును.

మరణానంతరము-రాజ్యము చేసిన సికందరు సమ్రాట్టును, ఆతని గుఱ్ఱపు రౌతు నొకే స్థితిని పొందిరి. అన్నిటికిని కారణభూతముగా నున్న బ్రహ్మపదార్థమునందు విలీనమై పోయిరి. లేదా ఒకే రకమైన అణువులుగా చెదఱిపోయిరి.

మార్కస్ అను నీ పేరును వ్రాయు టెట్లు? అని ఒకడు నిన్ను ప్రశ్నింపగా నీ వతనికి సావధానముగా ఒక్కొక్క అక్షరమును వ్రాసి చూపింతువుకదా! వ్రాయుటకు తెలియదని ఆతనిని నీవు కోపగింపవుకదా! అటులనే యీలోకము నందొక్కొక్క సమయమున నీ కేర్పడునట్టి కర్తవ్యము పలు విషయములతో కూడియుండవచ్చును. దీనిని జ్ఞాపకముంచుకొని అవసరపడకయు, క్రోధమనస్కులయందుకోపము వహింపకయు సహనశీలుడవై నీ కర్తవ్యము నాచరింపుము.

తనకు సంబంధించిన విషయములం దొకడు తన సౌఖ్యమును కోరియు, లాభము నుపలక్షించియు తన యిచ్ఛ వచ్చినట్లు సంచరించుచున్నాడు. దానిని నిరోధించుటకు నీ కేమి హక్కు కలదు? దోషము కావించె ననుచు నతనిపై

కోపముబూనుట అతని స్వాతంత్ర్యమును ప్రతిఘటించుటయే కదా? స్వలాభము నాశించి యతడు తన యిచ్ఛవచ్చినట్లు సంచరించుట దోషముగా నుండవచ్చును. అట్లయినను కోపము చెందక తప్పుచేసినవాని కా తప్పును చూపి యతనికి జ్ఞానము నొసగుము.

తోలుబొమ్మలాటలో బొమ్మల నాడించువిధమున ఆశలు మనల నాడించుచున్నవి. ఆ సమయమున వివేకము నకు లోగక మనస్సు స్వేచ్ఛగా సంచరించుచున్నది. దేహా మునకుగాను పాటుపడుట బాధావహామే. ఈ బాధలనుండి విముక్తి చెందుటయే కదా మరణము!

నీ ఆత్మ సామాన్య మానవుని యాత్మగా నుండుటను మాని ప్రభునాత్మగా మార్పు చెందకుండునట్లు చూచు కొనుము. సహవాసదోషముచే నీవును చెడిపోగలవు. అందు వలన జాగరూకుడవై యుండుము. సామాన్య మానవుని లక్షణములను కోల్పోవవలదు. ఆత్మగౌరవమును సంరక్షించు కొనుచును, ధర్మమును త్యజింపకయు, న్యాయమునకును భగ వంతునకును భయపడుచును సంచరింపుము. తోడిమానవు లను ప్రేమింపుము. కర్తవ్య నిర్వహాణమునందు ధైర్యముగా నుండుము. ఏ ధర్మశాస్త్రమును పఠించితివో దాని ననుసరించి ప్రవర్తించుటకు ప్రయత్నింపుము. జీవితకాలము ఎక్కువగా లేదు. ధర్మబద్ధమైననడవడియు ఇతరులతో సహాకరించి జీవించుటయు ఈ రెండును, మనుగడను సార్థకము చేయు మార్గములు.

ఏపని తలపెట్టినను నీవు నీ తండ్రి యైనఅంటోనినసును గురువుగా భావించుకొని ఆయన జీవితమార్గము ననుసరింతువు గాక! ఏకార్యమునందు నిమగ్నుడైనను ఆయన ఒకేధర్మము నవలంబించెను. సమతాస్థితిని త్యజింపక మనస్సును కాపాడు కొనుచుండెను. ఆయన ముఖమున శాంతము తొలకాడు చుండెను. లలితోక్తులనే మాటాడుచుండెను. ఇతరుల ప్రశం సల నాశించి తనధర్మమును త్యజింపడు. రాజ్య వ్యవహార ములను విసుగు గొనక పర్యవేక్షించెను. ఎట్టి విషయము నైనను సరే ఆయన నిర్భయముగా విచారించుచుండెను; అసంపూర్తిగా తెలిసికొని తృప్తి చెందడు. నిర్హేతుకముగా ఎవరైనను ఆయనపై దోష మారోపించినను దానిని విని ఆయన సహించును. దోష మారోపించినవానిపై తప్పు చెప్పడు. ఆయనలో తొందరపాటు లేదు. కొండెములు చెప్పు ప్రజల మాటలను విన నొల్లడు. ప్రజల నడవడిని, వారిస్వభావమును గ్రహించుటలో ఆయనకు గల సూక్ష్మబుద్ధి అపారము! ఇతరులపై నింద మోపడు. జంకు లేదు. సంశయా త్ముడు కాడు. యుక్తియుక్తముగా వాదించుట యందాయ నకు సంతోషము శూన్యము. దుస్తులు, శయ్య, పరివారము, ఆహారము – అన్నిట నెంత నిరాడంబరము! పనిపాటులలో విసుగు లేదు. స్నేహితుల యెడల సతతము మిత్రతను పాటిం చెను. భేదాభిప్రాయము లున్నవారి యొద్దను, తన్ను ప్రతి ఘటించి మాటాడువారియందును శాంతస్వభావుడై యుండెను. తాను విశ్వసించినదానికంటె మహోత్కృష్ట

మగుదాని నెవరైనను నుడువగా అందుల కాయన మిక్కిలి సంతోషించును. ఆయన దైవభక్తుడు. కాని మూఢులవలె భూతప్రేతాదులనిన భయపడడు. ఆయన జీవితయాత్రవలె నీ జీవితయాత్ర కూడ సాగవలెను.

నాకున్నది ఒక దేహము; ఒక మనస్సును. ఈ దేహమో తెలివి లేని వస్తువు. మనస్సు సహాయముతో అది సుఖదుఃఖములను గుర్తించుచున్నది. తన యిచ్చవచ్చి నట్లుగా సంచరించు స్వాతంత్ర్యము మనస్సునకు కలదు. కావున ఇతర విషయము లేవియు దానిని బాధింపవు. వర్త మానకాలమే దానికి చెందినది. భూతభవిష్యత్కాలములు మనస్సును స్పృశింపవు. గతించినవియు, రాబోవునవియు వర్తమానభావములుగా రూపొంది అవి మనస్సున నెలకొనుచున్నవి.

ఆసియా ఐరోపాలు ప్రపంచములో ఎంత చిన్న భాగములు! మహాసముద్రముల నీరంతయు కలసిన ప్రపంచ మున కొక బిందువు మాత్రమేయగును. వర్తమానకాలమును, అందు సంభవించుసంఘటనములును గతించినకాలమున ఏపా టివి? ప్రపంచమునందలి సర్వ పదార్థములకును మూలపదార్థ మొకటి కలదు. లేదా అవి ఆ పదార్థమునుండి యేర్పడిన వానినుండి యేర్పడినట్టివే. వన్యమృగములు, గరళము, కంట కములు మున్నగు దుఃఖదాయకములు కూడ సౌందర్యాత్మ కము, విశిష్టగుణోపేతము నగుబ్రహ్మ పదార్థమునుండి ఉత్ప న్నములైనవే. మనకు సౌఖ్యముకలిగించు వస్తువును, కష్టము

కలిగించు వస్తువును వేర్వేఱని తలచి వానిని ద్వేషింప వలదు. దేనిని చూచినను దానికి మూలకారణ మైనబ్రహ్మ పదార్థమును గూర్చి చింతింతువుగాక!

లోకమునందలి సర్వ పదార్థములు నొకదాని కొకటి అనుసంధింపబడియున్న ఆ మహావ్యవస్థను పరికింపుము. సూక్ష్మముగా చూడగా సర్వవస్తువుల నడుమ నొక సన్నిహిత సంబంధ మున్నట్లు స్పష్టమగును. ఒకదానితో నింకొకటి సంబంధపడనట్లుగా పైకి కనబడినను నిజమునకు వాని మధ్య దగ్గఱి సంబంధము కలదు. సర్వవస్తువులయం దా సంబంధము అనుగతముగా వచ్చుచునేయున్నది.

ఒకవస్తువునో, ఒకపరికరమునో తయారు చేయునాతడు ఆవస్తువులు పరిశ్రమ కుపయోగపడు విధమును గూర్చి కూడ ఆలోచన చేయును. కాని ప్రకృతి నిర్మించుపదార్థము లట్టివి కావు. వానిలో మహాశక్తి చాటుగా నుండియే అవి ఉపయోగపడునట్లు చేయుచుండును. అందువలన ఆమహాశక్తి నీలో నెలకొని నిన్ను కార్యోన్ముఖునిగా చేయుచున్నది. నీవా శక్తి ననుసరించినచో అంతర్యామి యై యున్నబ్రహ్మపదార్థము నీచే కావలసినవాని నెల్లను అనాయాసముగా సమకూర్చుకొను చుండును.

సుఖదుఃఖములు నీ హృదయములో నీ యధీనములోనే యున్నవి. హృదయమునకు వెలుపల ఏదియు లేదు. బాహ్యప్రపంచమున సుఖదుఃఖముల కేవో కారణము లున్నవని తలచి దైవమును నిందింతువు. ప్రజను ద్వేషింతువు.

న్యాయరహితముగా ప్రవర్తింతువు. సుఖదుఃఖములు నీ హృదయాధీనములే. నీ మనోధర్మములే వానికి కారణములగు చున్న వనుసత్యమును గ్రహించినప్పుడు దేవుని దూషించుటకో, మానవులను నిందించుటకో కారణములు కనబడవు.

లోకము నందుండు మన మెల్లరము సంఘీభావముతో కృషి సలుపుచున్నాము. ఈ విషయము నెఱిగి కొందఱు కృషి చేయుచున్నారు. మఱికొందఱు తమకు తెలియకయే దైవనిర్ణయములను నెఱవేర్చుచున్నారు. అజ్ఞానావస్థలోనున్న వారు కూడ యథోచితముగా లోకముతో సహకరించుచున్నారు. ప్రపంచగమనమును ప్రతిఘటించుచు అంతరాయములు కలిగించువారును, విధ్వంసకచర్యయం దాసక్తి కలవారును గూడ ప్రపంచమునకు కావలసినవారే. ఇతరులు కష్టించి కృషి యొనర్చుచుండగా ప్రతిఘటించుచు వీరును కృషి చేయుచున్నారు. ప్రపంచము నేలు నామహాశక్తి అందఱను తనసాధనములుగా నుపయోగించుకొనుచున్నది. ఏది నీకు శ్రేయోదాయకమై యుండునా యని నీ వాలోచన చేయవలెను. ప్రతిఘటించుచు సేవ చేయుదువా? సత్యము తెలిసికొని సఖ్యభావముతో సేవ చేయుదువా?

నా యొక్కని అభ్యుదయము నుద్దేశించి దైవము నన్నొకకంట కనిపెట్టుచున్నదో లేదో అని దిగులు పడుచున్నావు. నా అభ్యున్నతిని దైవము గమనించుచున్నదని నేను విశ్వసించియు నే నెందుకు వ్యథ చెందవలెను? దైవమునకు

సలహా చెప్పవలెనా? సర్వమానవాభ్యుదయమును గూర్చి దైవమునకు లెస్సగా తెలియును. నా అభ్యుదయమున కవ రోధము కలిగింప నెంచినచో అందువలన భగవంతునకు గాని, లోకమునకు గాని లాభమే మున్నది? నన్నా భగవం తుడు విస్మరించె ననుకొన్నను ప్రపంచాభ్యుదయము గుఱించి యైనను అతడు నన్ను గమనించియుండ వలెను గదా! అందు వలన నాకు కష్టము కలిగినచో దానిని శిరసావహించి నే ననుభవింపవలెను

భగవంతుడు మనల నొకకంట కనిపెట్టుచున్నాడనుట అసత్యమనియే భావింతము. అట్లయిన, ఏది నాకు శుభ ప్రదమైనది? అని ప్రశ్నించుకొనవలెను. నా సహజ ప్రకృతి ననుసరించి ప్రవర్తించుటయే నాకు లాభదాయకము. లోకజ్ఞానముతో ప్రవర్తించుటయే నా సహజప్రకృతి. మార్కస్ నివాసస్థానము రోమ్‌నగరము. రోమ్ నగరమున కును, లోకమునకును ఏది శుభోదర్కముగా నుండునో అదియే మార్కసునకును శ్రేయోదాయకము.

మరణించినవారిని తఱచుగా స్మరణకు తెచ్చుకొను చుందుము. వివిధము లగువృత్తులలో నిమగ్నులై కాలము గడపిన వివిధజాతులవారును మరణించి నేడు చీకుచింతలు లేని వారైనారు. వీరు విగతజీవు లగుటచే ఎవరి కైనను దుఃఖము కలిగెనా? వీరి పేళ్లను గూడ ఒక్కడును తలచుట లేదు. ఈ లోకమున పొందదగు గొప్పతన మొక్కటియే కలదు. సత్యమును, సమతాస్థితిని అవలంబించి జీవించు

టయు, అసత్య భాషకులయందును, అవినీతిపరులయందును ద్వేషభావముతో గాక సుహృద్భావముతో ప్రవర్తించు టయు వాంఛనీయములు. వీనిని చేపట్టిన పిమ్మట మరణించిన మాత్ర మేమి ?

ప్రజకు జ్ఞానోదయము కలిగించి వారిని సంస్కరింపుము. వారి అభిలాషలు దోషపూరితము లై యున్నచో వానిని నిరాకరించి న్యాయముగా ప్రవర్తింపుము నీ మాటలను పెడచెవిని బెట్టి పశుబలము నుపయోగించి వారు నీకంతరాయములు కలిగించినను అందులకై నీవు విచారింపకుము. మనస్సు ప్రశాంతముగా నుండునట్లు చేసికొని ఆ యంతరాయములనే యుపకరణములుగా చేసికొనుము. కాజాలని యొక కార్యమును నీవు చేయలేవు. నీవు చేయదగు ప్రయత్నమే నీ కర్తవ్యము. దానిని నీవు నిర్వర్తింప గలిగిన చో నీలక్ష్యము సాధింపబడెననియే నుడువవచ్చును.

మన మభిలషించినచో ఎట్టి విషయము నైనను మనస్సులోనికి ప్రవేశింపనీయకయే చేయవచ్చును. ఆ విషయమును గూర్చి స్మరించుట మానిన చాలును. మనము తావీయకున్నచో ఇతర విషయములు మనస్సును చొచ్చుటకు మార్గము లేదు. మనోదుర్గద్వారపు తాళపుచెవి మన యొద్దనే యున్నది.

తేనెటీగలను చూడుము. తమ సమూహమునకు తోడుపడనట్టి దానిని ఒక్క తేనెటీగయు తనకని వాంఛింపదు.

కామాలరోగము (కామెర్ల) గలవానికి తేనె చేదుగా నుండును. పిచ్చికుక్క కఱచిన వానికి నీటిని చూచిన భయ మెక్కువగా నుండును. వ్యాధి ఫలితములుగా నేర్పడిన యిట్టి పరిస్థితులను చూచి కోపము బూనుట దోషముగా గణింప బడును. పైత్యవిషము కంటెను అవివేకగరళపువేగ మెక్కువ కదా! ఈ కారణము వలననే మానవుడు దుష్టభావనలు చేయుచున్నాడు. అట్టివానిని చూచి నేను కోపగించుట న్యాయ మగునా ?

నీ సహజప్రకృతి ననుసరించి సంచరించినచో నిన్నె వ్వరును నిరోధింపజాలరు. నీ కేర్పడునవి యన్నియు ప్రపంచ వ్యవస్థ కనుబంధములుగా నేర్పడునట్టివే. అందు వలన విధిని తలచికొని విచారపడవలదు. ఏమి సంభవించి నను సరే దాని ననుసరించి నీవు చేయవలసిన దేదియో తెలిసికొని అటులనే చేయుము. మనస్సు నందలి సమతా స్థితిని కోలుపోవకుము. నీ సౌఖ్యము నీ లోనే కలదు.

ఒక కార్యమునందు నిమగ్నుడ వైనచో 'ఇది నావలన చేయ వీ లగునా? నాశక్తికి మించినదా' అని యోచన చేసి చూడుము. దైవ మొసగిన శక్తియే సాధన మని తలచి దాని నుపయోగింపుము. నీ శక్తికి మించినచో ఆ కార్యము నందు సమర్థ డగుమఱియొకనిని నియోగించి నీవు పరోక్షముగానుండి దానిని తిలకింపుము. ఇట్లొనర్చుట ధర్మవిరుద్ధ ముగా నున్నచో అట్లు చేయకుము. లేకున్నచో ఇతరుని సహాయమును గైకొని లోకమున కుపకరించు కార్యము

నాచరింపుము. నీవే యైనను సరే, ఇతరుని తోడ్పాటుతో నైనను సరే నీవు చేయుపని మాత్రము లోకమున కుపకరించునదై యుండవలెను.

భవిష్యత్తును గూర్చి మనోవైకల్యము చెందవలదు. ఇప్పు డున్న జ్ఞానమునే అప్పుడు నుపయోగించి నీ కర్తవ్యమును నెఱవేర్చుకొనవచ్చును. అందువలన ఇప్పటినుండియు విచారపడ నవసరము లేదు.

లోకమునందలి సర్వపదార్థములును ఒక దానితో నొకటి పరస్పర సంబంధమును కలిగియున్నవి. ఈ యనుబంధము దైవికమైనట్టిది. సర్వవస్తువులు నొక దానితో నొకటి ముడివడి యున్నవి; అంతేకాని యవి విడివడి లేవు. పరస్పరసంబంధము గలపదార్థముల సమష్టి స్వరూపమే యీ లోకము.

జ్ఞానవిశిష్టుని ప్రకృతి కేది యంగీకృత మగునో జ్ఞానమునకు గూడ నదియే అంగీకృత మగుచున్నది. ఈ రెంటికిని అధిదేవత యొక్కటియే.

మానవు లందఱును శరీరము నందలి వివిధావయవముల వంటివారు. ఒకటిగా కూడి నివసించుటకే వారు మనుచున్నారు. వారి ప్రకృతియు నందులకే సమ్మతించుచున్నది. మానవవర్గ మనెడి యీ దేహమునందు నీవు నొక భాగమై యున్నావని తఱుచుగా చింతింతువు గాక! ఈ విషయము నీ మనస్సులో నెలకొని యుండవలెను. మానవులలో ఒకడనై యున్న నేను నా ప్రాణమును, నా జీవితవిధాన

మును వేర్వే అని తలచుచున్నంతవఱకును నాకు లోకోపకార మొనర్చుటయందాసక్తి కలుగ లేదనియే భావింపవలెను. విధ్యుక్తధర్మము నుద్దేశించి యితరులకు సహాయము సలుపుచున్నానే కాని అట్లొనర్చుట నాకు నేనే యుపకారము చేసికొనుచున్నానని మాత్రము నే నింకను తెలిసికొన నైతిని.

ఏమి సంభవించిన నేమి? అది నా శరీరమును స్పృశించునే కాని మనస్సును బాధింపదు. దేనిని స్పృశించునో దానికే కదా విచారము కలుగును. అది దుఃఖకారణముగా కనబడినను అది నన్నేమి చేయగలదు? దానిని దుఃఖహేతువుగా భావించుటయు, భావింపకపోవుటయు నామనోధర్మములపై నాధారపడియున్నది.

ఎవరేమి చేసినను, ఏమి నుడివినను అవి పరహితార్థములుగా నుండవలెను. బంగారము, పట్టుపుట్టము, మరకతము—వీని అందచందములును, వర్ణమును ఇతరుల మాటల వలన గాని, చేతలవలన గాని మాఱవుగదా?

త్వరలో సర్వమును విడిచివైచి నీవద్భుశుడవగుదువు. నిన్ను విడనాడి సర్వమును మాయ మగును. దీనిని గ్రహించితివా?

నీకపకారము చేయువారిని కూడ ప్రేమించుట నీ ధర్మము. నీ ఆత్మీయుడు తప్పిద మొనర్చినందుకు కారణ మాతని యవివేకమే. అంతరాత్మయొక్క అంగీకారమును పొందకయే యాతడు తప్పిద మొనరించు చున్నాడు. వీా

రిరువురును అచిరకాలముననే మరణింప నున్నారు. అతని దుష్కృత్యము వలన నీ ఆత్మకు కలిగిన హాని యేమియు లేదు. నీమనోధర్మము మాఱినచో అప్పుడు నీకు కష్టము కలుగును. దీనిని జ్ఞప్తియందుంచుకొనిన, కీడొనరించిన వానిని గూడ ప్రేమించుట సులభముగా నుండును.

లక్కతో బొమ్మ చేయబడునట్లుగా ప్రకృతిపదార్థము నుండి మహాశక్తి సకలపదార్థములను సృజించుచున్నది. ఒక వస్తువును లయింపజేసి ఆశక్తి వెంటనే అందుండి మఱియొక పదార్థమును తయారుచేయుచున్నది. ప్రకృతము గుఱ్ఱముగా నున్నది రేపు ద్రాక్షగా మాఱును. తరువాతి కాలమున అది మానవునిలో చేరును. అటు పిమ్మట అది వేఱొక వస్తువుగా మాఱును. ఒక్కొక్కటియు కొంత కాలమువఱకే జీవించియుండును. ఒక పెట్టె చేయబడినచో అందువలన దాని కేమిసుఖము? ఆ పెట్టెను ముక్కలు ముక్కలుగా విభజించి నను దానికి విచారము కలుగునా? అటులనే నీవును చింతను మాని నివసింపవలెను. అదియే జ్ఞానము.

నీ కొకడు హాని తలపెట్టినచో తోడనే యతడు దేని నుద్దేశించి యిట్లు చేసెను? దేనిని ద్వేషించి యిట్లు చేసెను? అని చింతించి చూడుము. ఇట్లు విమర్శించి చూచిన పిమ్మట నీ కతనిపై అనుకంప కలుగును. క్రోధము వహింపవు. తన మంచిని కోరి యాతడు దేనిని అభిలషించుచున్నాడో నీవును దానినే అభిలషించుచున్నావు. కావున అతని తప్పిదమును సహించుట నీ కర్తవ్యము. ఒకవేళ నీబుద్ధివిశేషముచే అత

డభిలషించిన పదార్థము అస్థిర మైనదనియు, నాతడు దుఃఖ హేతువును ద్వేషించుచున్నాడనియు నీవు కనుగొనినచో, అతనికి నిజ మగుజ్ఞానము లే దని తలచి అప్పు డతనిని కనికరింప వలసినదే కదా!

నీయొద్ద లేని పదార్థమును నీవు కోరవలదు. నీ యధీనములో నున్న విశిష్టపదార్థములను చూచి సంతసింతువు గాక. అవి కూడ లేకున్న చో వానికై యెంతగా తాపత్రయము చెందియుండెడివాడవో చింతింపుము. ఇట్లు చింతించి యున్న దానితో తృప్తిపడుము. కాని ఒక హెచ్చరిక. ఇట్లు చింతించి నీ యొద్ద నున్నవస్తువులయందు తీఱనిమమకారమును మాత్ర ముంచుకొనవలదు. అవి భ్రష్టము లయినప్పుడు నీవు మిక్కిలి దుఃఖింతువు.

ఇంద్రియములను నిగ్రహించి ధ్యాన నిమగ్నుడవు గమ్ము. సమతాస్థితి యం దుండుమనస్సునకు ధ్యానమువలన తృప్తి కలుగును.

మరణ మనగా నేమి? శరీరమునందు శరీరము తప్ప ఇం కేమియు లే దన్నచో అణువులు విశ్లేషము చెందుటయే గదా! ప్రాణ మనునది వే ఱయినచో అదియును పిమ్మట మఱియొక దేహమున ప్రవేశించును; లేదా అంత మొందిన మాత్ర మేమి?

బాధ యనగా నేమి? సహింపరానిదైనచో ప్రాణము పోవును. పిమ్మట బాధయే యుండదు. మనస్సును తనలో లీనము చేసికొని దానిని నిగ్రహించుకొన్నచో ప్రశాంతతను

బడయవచ్చును. దేహమును బాధించు బాధవలన ఆత్మకు దుఃఖము కలుగదు. మనస్సును వశము చేసికొని బాధను సరకుసేయకున్నచో అప్పుడు బాధ మనల నేమియు చేయ జాలదు. శరీరమునకా విలక్షణమగు చైతన్యము లేదు.

అనంతకాలమును, ప్రకృతిపదార్థములను విశాల దృష్టితో దర్శింప గలిగిన విజ్ఞానవిశిష్టునకు మానవజీవిత యాత్ర లవలేశముగా కనబడును. అతడు మరణమునందును దుఃఖమును కనుగొనడు.

సత్కార్య మొనర్చుటయు, దూషణోక్తులకు గుఱి యగుటయు ననునీరెండును రాజులకుగల మహాభాగ్యములు.

శారీరకబలముచే నిన్నొకడు జయింప వచ్చును. కాని సఖ్యత, విధేయత, సహనము, కోపము వహింప కుండుట—వీనిలో అపజయము పొందకుము.

నీ మనస్సులో ఇంద్రియములను లీనము చేసికొని వానిని నిగ్రహింపుము. నీ హృదయము తఱుగని నీటియూట. త్రవ్వగా,త్రవ్వగా అందుండి'మంచి' యేర్పడుచునేయుండును.

ఎవరి ప్రశంసలను నీవు కోరుచున్నావు ? వారి జ్ఞాన మెట్టిది ? యోచించి చూడుము. మానవుల చేతలును, తల పోతలును వారి జ్ఞానము ననుసరించియే యుండును. దోష మొనర్చునప్పుడు ఆత్మసాక్షికి విరుద్ధముగా వారు సంచరించు చున్నారు. ఆత్మసాక్షికి విరుద్ధముగా నుండు వారి కృత్య ములను దోషములుగా భావింపవలదు. అట్టి వారి ప్రశంస లను మన్నించు నవసరమును లేదు.

---

సహజముగా ఎవ్వడును సత్యమును విడనాడి అసత్యమును చేపట్టడు. అటులనే నీతి, న్యాయము, ప్రేమ మొదలైనవిషయము లందును. దీనిని విస్మరింపక జ్ఞాపక ముంచుకొనుము. అప్పుడే దోష మొనరించు వారి యెడల గూడ దయార్ద్రహృదయుడ వై ప్రవర్తింపగలవు.

నీ తప్పుత్రోవల నుండి నీవు బయటపడు విధము నీ స్వాధీనములోనే యున్నది. ఇతరుల తప్పుత్రోవలనుండి వారు విముక్తి చెందుటకు నీవు వారికి తోడ్పడ లేవు. అయినను సాధ్య మగు పనిని చేయ నొల్లవు. ఏది యసాధ్యమో దానినే చేయ నభిలషింతువు. ఇది హాస్యాస్పదముగా లేదా?

ఉపకార మొనర్చుట, ఉపకారమును బడయుట— ఈ రెంటితోనే నిలువక యింకను ఏలమూడవదానికై అన్వేషణము సలుపుచున్నావు? అవివేకులు తా మొనర్చిన యుపకారమునకు ప్రత్యుపకారమును, ప్రశంసను అభిలషింతురు.

ఉపకారమును బడయుటలో ఎవరికిని కష్టము లేదు. పరోపకార మొనర్చుటవలననేగదా నీవు నీ సహజధర్మమును సంరక్షించుకొన గలుగుచున్నావు. అట్లొనర్చుట నీకై నీవు చేసికొను ఉపకారమే యగును. అందువలన ఇతరులకు తోడుపడుట కష్ట మని భావింపకుము. అది తోడ్పాటును పొంది నట్లే యగును.

మహాశక్తి యీ లోకమును క్రమబద్ధముగా నిర్మించి నది. ఆక్రమము ననుసరించియే అన్నియు జరగుచున్నవి. సర్వము ప్రపంచవ్యవస్థ కనుకూలముగానే జరుగును. కావున మనోవైకల్యము చెందవలదు. కొంతకాలమునకు పిమ్మట నీవు విగతజీవుడ వగుదువు. యశశ్శరీరు లైననీపూర్వు లెట్లు మరణించి మాయ మైనారో, అటులనే నీవు కూడ నదృశ్యుడ వగుదు వని జ్ఞప్తి యందుంచుకొనుము.

ఎప్పుడేపనిని చేయవలెనో దానిని గమనించి చేయుము. ఇతరులకు మేలు చేయుటయు, మానవప్రకృతి ననుసరించి మెలగుటయు నీకర్తవ్యములు. దీనిని విస్మరింపక ఎట్టిపరిస్థితి యందును నీ చేతలు ధర్మవిరుద్ధములు కానట్లు చూడుము. నీ మాటలు కూడ ధర్మవిరుద్ధము లై యుండగూడదు. పొల్లు మాటలను కట్టిపెట్టి వినయపూర్వకముగా మృదూక్తులతో భాషింపుము.

ధర్మమార్గానువర్తి యైనవానిహృదయము నందు సంతోషము స్థిరముగా నెలకొనును. ధర్మహానిని నివారించుటకు మనస్సును సంరక్షించుకొనుము. భయ పూరితములు, అసత్యయుతములు నగుభావములను పాఱదోలియు, లోకమున కుపకరించు కార్యము నందే మనస్సును చొప్పించియు, నీ యధీనమున లేని పదార్థములయందు రాగద్వేషము లుంచుకొనకయు మెలగుచు ప్రపంచగమనమున ఏది సంభవించినను దానిని సహర్షముగా స్వీకరించు నట్టిసుస్వ

భావము నలవఱుచుకొనుము. అప్పుడే జ్ఞానవిశిష్టుడు ధర్మచ్యుతుడు కాజాలడు.

చెట్టున నున్న ఆకు తనకు కావలసినవానిని పొంది పెరుగుచున్నట్లు, బ్రహ్మపదార్థ మనువృక్షము నందలి ఒక ఆకుగా నున్ననీవును సంరక్షింపబడుచున్నావు. ఏ బ్రహ్మపదార్థమునందలి ఆకుగా నీవున్నావో ఆపదార్థమునకు మితిలేనిస్వాతంత్ర్యము, తెలివితేటలు నున్నవి. ఆ పదార్థమే యొక్కొక్క ప్రాణికిని వలసినంతగా ఆయుర్దాయము, సంపద, అభిలాష, ప్రయత్నము, సమయస్ఫూర్తి మున్నగు వానిని సరిసమానముగా ప్రసాదించుచున్నది. సమమనగా ఒక్కొక్క భాగము సమముగా నుండదు. కాని అన్నిటిని సమదృష్టితో పరీక్షింపగా అన్నియు తుల్యములే యని తోచును.

నీ కార్యకలాపములవలననో వేఱే యితర కారణముల వలననో గ్రంథపరిశీలనమున కవకాశము లభింప కున్నను ఇతరులద్వేషమునకు లోనుగాక ప్రవర్తించుటకుకూడ విఘ్నము కలిగెనా ? సుఖదుఃఖములవలన కలత చెందకుండ నుండుటకు నీ కింకను వ్యవధి కావలెనా? జ్ఞానవిహీనులను, కృతఘ్నులను చూచి కోపము చెందక వారి చేతలను నిర్లక్ష్యముచేయుటకు గ్రంథసహాయము కావలెనా ?

మరణానంతరము లోకమును వీడిపోవుదు నని తలంచుటను మానుము. వేఱొకరూపమున మరల లోకమున ప్రత్యక్ష మగుదువు. నీ శరీరము నందలి భూతములు విడివడి పోయి వేర్వేఱు పదార్థములలో విలీన మగును. ఆయాభూత

ములు నీకు చెందిన వని యిపుడు నీ వెట్లు తలచు చున్నావో అటులనే లోకమునకును అవి చెందినవే. వివిధాకృతులను గైకొనుటకు వానికి నిరోధ మేమియు లేదు. నీవు మాత్రము ఏల ఆక్షేపణ తెలుపుచున్నావు? నీ కా హక్కు కూడ లేదు!

నీవు చేయు ప్రతిపనియు మానవులకు తోడుపడు నట్టిదిగా నుండవలెను. నా కేది సంభవించినను అది దైవిక మని స్వీకరింతునుగాక. అన్నిటికిని కారణభూత మైనబ్రహ్మ పదార్థమునుండి యేర్పడిన దని తలచి ప్రతివస్తువును స్వీకరింతునుగాక.

నీ చేతలను కర్మానుసారులుగా చేసి సక్రమముగా జీవితము సాగింపుము. సర్వధర్మములు సక్రమముగా నీలో అంతర్లీనము లగునుగాక. అప్పుడే నీవు తృప్తి చెందుదువు. ఇట్లొనర్చుటలో నిన్ను నిరోధించువా రెవ్వరును లేరు. ప్రతిఘటనము కలదని నీవు పేర్కొనుదువు. కాని వివేకము, న్యాయము నీ యధీనమున నున్నవి. నీ చేతల కెవ రైనను విఘ్నములు కలిగించినప్పుడు, అందువలన కలుగు విచారమును త్యజించి పరిసరముల యందున్న అచేతనపదార్థములలో నదియు నొక భాగ మని తలచి నీకు సుసాధ్యముగా నుండు కార్యమును చేపట్టి యందు నిమగ్నుడవుగమ్ము. నీవు నిర్వహింపదలచిన సత్కార్యము ఇతరుల విఘ్నముల వలన ముగియకున్నప్పుడు తోడనే నిర్వహింపదగినదియు, జీవిత

లక్ష్యమును సాధించునట్టిదియు నగుమఱియొక కర్తవ్యము తనంతట తానే వచ్చి నీ సమక్షమున ప్రత్యక్ష మగును.

ప్రపంచగమనమున గతించినవానిని గుఱించి యసంతృప్తి చెందుటయు, అభ్యుదయ నిరోధకముగా ప్రవర్తించుటయు వాంఛనీయములు కావు. ఇట్లు చేసినచో నీవు ప్రపంచమునుండి విడివడిపోవుదువు. చేయి, కాలు, తల— వీనిలో నేదో యొక అంగము ఖండింపబడిన శరీరమును చూచితివా? నీవు నటులనే యగుదువు. ఒకవేళ విడివడిపోయినను మరల ఏక మగుటకు వలసినదివ్యశక్తిని భగవంతుడు నీకు ప్రసాదించియున్నాడు. ఈ శక్తి యితర ప్రాణులకు లేదు. ఒక్క మానవునియందు మాత్రమే యీ శక్తి యున్నది. విడివడిపోయినను ఈ శక్తిచే మరల ఏకమై మానవుడు వృద్ధికి రాగలడు.

నే నెచ్చటికి వెళ్ళిన నేమి? ఎచ్చట నున్న నేమి? నాహృదయమునం దున్నదైవము నన్ను విడనాడడు. ఆతని సహాయమును గైకొని నా విధ్యుక్తధర్మము ననుసరించి నేను ప్రవర్తించినచో నా హృదయమున ప్రశాంతత నెలకొనును. ఇట్లుండగా, ఒక విపత్తు సంభవించినంతనే మనోవైకల్యము చెంది భయవిహ్వలుడనై అటునిటు తిరిగియు, ఉపేక్ష వహించియు మెలగుట తగునా? తన మనోధర్మమును సంరక్షించుకొనుటకంటె మహోత్కృష్టమైనది మఱియొకటి లేదు.

దోసకాయ చేదుగా నున్నదా? పాఱవేయుము. మార్గమున కంటకము లున్నవా? ఆ త్రోవను వీడి ప్రక్కగా పొమ్ము. అంతే. కాయ ఏల చేదుగా నుండవలెను? ముండ్లు లోకమున ఎందుల కవతరింపవలెను? అను నిట్టి ప్రశ్నలు వేయవలదు. చర్మకారుని గదిలోనికి పోయి యచ్చట చెత్త చెదారమును, ఉపయోగపడని తోలుముక్కలు నేల యుండవలె నని ప్రశ్నించిన నిన్ను పరిహసింతురుగదా! అటులనే ప్రకృతి పరిశీలనము కావించిన జ్ఞానులు నిన్ను చూచి నవ్వుదురు. తన వృత్తికి తోడుపడనట్టి వస్తువులను పాఱవేసికొనుటకు వడ్రంగికి స్థల మున్నది. లోకమునకో యుపయోగపడని తుక్కుదులారమును పాఱవేసికొనుటకు లోకము తప్ప మఱియొక ప్రదేశము లేదుగదా? కాని ప్రకృతియొక్క ఆధిక్యమును చూడుము. పాఱవేయుటకు తగిన స్థలము లేనితన చెత్తచెదారమునుండి క్రొత్త వస్తువులు తయారుచేసి తద్విధముగా దానిని ఉపయోగించు కొనుచున్నది. ప్రాతవి క్రొత్తవిగా మాఱుచున్నవి. ఉపకరణములు చాలవు; పనితనము లేదు – అను నీ దోషములు ప్రకృతియందు మృగ్యములు. ప్రకృతిలోని ప్రతివస్తువునకును స్థాన మున్నది; ప్రయోజనమును గలదు.

ప్రకృతియొక్క సామరస్యమును గ్రహింపనివాడు తన గ్రామమును గూర్చి తెలిసికొన లేనిపామరు డగుచున్నాడు. ప్రకృతిలోని ప్రకృష్టత్వము తెలిసికొన లేనివాడు తన సహజ ప్రకృతిని గూడ గ్రహింప లేకున్నాడు. తన విధ్యుక్త ధర్మ

మును. సహజప్రకృతిని తెలిసికొనలేకున్నచో తానెందుకు జీవించుచున్నాడో కూడ తెలిసికొనలేడు. వివేకశూన్యుల ప్రశంసల నాశించియు, వారి దూషణోక్తులకు భయపడియు జీవించు నతని యవివేకము నేమని చెప్పుదును.

సర్వవ్యాపకమై యున్న వాయువును శ్వాసించి జీవించుట మాత్రమే చాలదు. సర్వవ్యాపకమైన బ్రహ్మపదార్థమును గూడ సమ్మానించి జీవింతువుగాక. ప్రాణమున్న వానికి శ్వాసించుటకుగాను సర్వే సర్వత్రా వాయువు వ్యాప్తమైనట్లుగా జ్ఞాని బ్రహ్మపదార్థమును స్వీకరించి జీవించు నిమిత్తము అది కూడ సర్వవ్యాపకమై యున్నది.

ప్రాణమును దేహమును వేర్వేఱు. అటులనే మన హృదయములును విభిన్నములు. మన మెల్లరము కలిసి సఖ్యజీవనము సలుపుటకే జన్మించితిమి. అయినను హృదయములు మాత్రము భిన్నములు. ఇట్లు లేకున్నచో ఇతరుడు చెడుత్రోవలు త్రొక్కినప్పుడు నేనును ఆ చెడుత్రోవలే త్రొక్కవలసియుండును.

సూర్యకిరణములు నలుమూలలకు వ్యాప్తములైనను ప్రకాశముమాత్రము తగ్గుటలేదు. చీకటిగదిలోనికి ఒకరంధ్రముద్వారా ప్రవేశించు వెలుతురును కనుగొనుము. అది సూటిగా పడుచుండును. దానికి నిరోధము కలిగినను, నిరోధము కలిగించు వస్తువు మీద కూడ అది పడును. ఆ వస్తువును వీడి అది తొ[illegible]గును సామ్యభావప్రవృత్తి కూడ నట్లుండవలెను. స్థిర మగుసదభిప్రాయము[illegible]వలెను.

సూటిగా పొమ్ము. నిరోధము కలిగించు వస్తువుపై వెలుతురు పడునట్లు నీమనస్సు సంచరింపవలెను. బలాత్కారమును, క్రూరత్వమును విడనాడుము. ప్రతిఘటనమును ద్వేషింపవలదు. కిరణప్రకాశమున కవరోధము కలిగెనన్నచో ఆ దోషము కిరణములది కాదు; అవరోధము కలిగించు వస్తువుదే.

మరణమును చూచి భయపడెడువాడు దేనిని చూచి భయపడుచున్నాడు? ప్రాణము, చైతన్యము – ఇవి నశించుచున్నందులకా? నూతనము లగుజీవ చైతన్యములు కలుగు ననియా? చైతన్యము నశించునప్పుడు దుఃఖింప నేల? నవ్యతను పొందుట దుఃఖకారణమా?

ఒకరి కొకరు సహాయము చేసికొనుచు నివసించుటకే మనలను భగవంతుడు సృజించియున్నాడు. అందువలన తప్పులను సరిదిద్దవలెను లేదా వానిని సహనముతో స్వీకరింపవలెను.

సఖ్యజీవనము సలుపుటకే మనము జన్మించితిమి. ఒకరి కొకరు కీడు చేసికొనగూడదు. అధర్మముగా ప్రవర్తించువతడు పలుదేవతల నారాధించినను ఆతడు పరమేశ్వరుని పూజింపనివాడేయగును. అసత్యభాషకుడు కూడ దైవద్రోహి యగును. బ్రహ్మపదార్థము సత్యస్వరూపము. పదార్థముల నడుమ సన్నిహితసంబంధము కలదు. అందువలననే ప్రపంచవ్యవస్థ క్రమబద్ధమై యున్నది. క్రమబద్ధము కాకున్నచో

తద్వ్యవస్థ కంతరాయ మేర్పడును. అంతేకాక భగవన్నిర్ణయమునకు నది విరుద్ధముగానే యుండును.

ప్రకృతియే సత్యము. సత్యమునకు నామాంతరము ప్రకృతి. ప్రకృతియే సత్యమునకు మూలాధారము. అందువలన బుద్ధిపూర్వకముగా అబద్ధము మాటాడువాడు నిశ్చయముగా దైవద్రోహి యగును. ఊరక అబద్ధ మాడువాడు కూడ క్రమబద్ధమైన ప్రకృతి వ్యవస్థకు విరుద్ధముగా ప్రవర్తించి దైవద్రోహి యగుచున్నాడు. తన్ను తెలిసికొనలేకయు, సత్యాసత్యములను గ్రహింపకయు, తనకు గల సహజ వివేచనా శక్తిని విడనాడియు - ఆత్మ వంచనమునకు కడంగు మానవుడు దైవ సృష్టిలో కయ్యాలక్రచ్చ యగుచున్నాడు. సౌఖ్యము నాశించి, దుఃఖముల బాఱినుండి బయటపడుటకు యత్నించువాడును దైవద్రోహి యగుచున్నాడు. దుర్జనులు ధనాఢ్యులై శాంతిసౌఖ్యము లనుభవించుచుండగా సజ్జనులు పలువురు బాధావహులగుటను చూచి మంచిచెడుగులను ఉచితరీతిని కల్పించుట లేదని పామరులు పరమేశ్వరుని నిందింతురు. హితాహితముల నిజతత్త్వమును సమగ్రముగా తెలిసికొనని హేతువువలననే వా రట్లు నిందింతురు. దుఃఖమును చూచి భయపడువాడు లోకమునందలి యొక ముఖ్య సంఘటనమును కనుగొని భయపడునట్లుగా భావింపబడును. సౌఖ్యమునే మిక్కిలిగా కోరువాడు అధర్మపథమున సంచరించుటకును వెనుకంజవేయడు. కనుక ఇది నిశ్చయముగా దైవద్రోహ మగుచున్నది. అందువలన దైవభక్తికలవాడు, లోక

-మున ఎట్లు సుఖదుఃఖములు సమపాళ్లలో గలవో, అటులనే తన జీవితమునందును సుఖదుఃఖములు సరిసమానముగా నున్న వని భావింపవలెను. సుఖదుఃఖములు, జననమరణములు, నిందాస్తుతులు–మున్నగు ద్వంద్వములను సమదృష్టితో వీక్షించ గలవాడు దైవభక్తుడు కాజాలడు. సృష్టిలో ఇట్టి ద్వంద్వము లేర్పడియున్నవి. పదార్థములు సక్రమస్థితిని పొందుటకును, మార్పులు చెందుటకును, క్రమవిహితముగా సంచరించుటకును వానిలోనే శక్తియొకటి అంతర్యామియై యున్నది. ఆశక్తికి హద్దు కూడ నున్నది. దానివలననే సుఖదుఃఖాదులగు ద్వంద్వము లేర్పడుచున్నవి. ప్రకృతికి ముఖ్యావసరము లైన సుఖదుఃఖాదులు ప్రపంచగమనమునందు ప్రాముఖ్యతము లై యున్నవి.

మరణ మనునది లోకమునందలి యొక ముఖ్యమైన సంఘటనము. అది దైవనిర్ణయము. బాల్యమునకు పిమ్మట యౌవనము కలుగునట్లుగా జీవితాంతమున మరణము కూడ సహజముగా సంప్రాప్తించును. అందువలన జ్ఞానవిశిష్టుడు మరణమును ద్వేషింపడు. ప్రకృతి శక్తులలో అది కూడ నొక సత్యపదార్థమని తలచి దానికై యాతడు నిరీక్షించుచుండును. మాతృగర్భమునుండి శిశూదయ సమయమునకై నిరీక్షించు నట్లుగా ఈ శరీరమున బంధింపబడియున్న ఆత్మ విముక్తి చెందుటకై యత్నింపుము. మఱియొకవిషయము. సహార్ష ముగా మరణమును స్వీకరింపవలె ననుట కొక కారణమున్నది. కోపము వలదు. సత్యపదార్థమును స్వీకరింపుము. నీ పరి

సరములనుండు వారి మనోభావములకును నీ మనోభావముల కును భేదమున్నదా?

భేద మున్నచో వారి స్నేహమును త్యజించుట మంచిది కాదా? జీవింపవలయు ననుటకు ముఖ్యకారణ ముండవచ్చును. నీ మనఃప్రవృత్తిని తలపించు చిత్తవృత్తి గలవారితో కలసి జీవింపవచ్చు నని కదా నీ ఆశ. కాని ఎవరినడుమ నీవు జీవింప నభిలషించుచున్నావో వారిమనోధర్మములకును నీ మనో ధర్మములకును దగ్గఱిచుట్టఱికము లేదు.

"మరణమా! రమ్మ. శీఘ్రముగా రమ్మ. లేదేని నేనును వీరివలె జ్ఞానవిహీనుడ నగుదును." ఇట్లు భావించి మరణమును ఆహ్వానింప వలసియున్నది గదా!

ఇతరుల యెడల అధర్మముగా ప్రవర్తించు నతడు తుదకు తనకు తానే కీడు తెచ్చిపెట్టుకొనుచున్నాడు. ఇతరులకు హాని కలిగించువాడు తన సహజస్వభావమును కలుషిత మొనర్చుకొనుచు తనకే ముప్పు తెచ్చిపెట్టుకొనుచున్నాడు.

జ్ఞానవిశిష్టుడవై మనస్సు నందే ఆశలనుంచుకొనుట, ఇతరుల కుపకరించునట్టి కార్యములనే చేయుట, నీ స్వాధీనములో లేని సంఘటనములు సంభవించినచో వానిని సహర్షముగా స్వీకరించుట—ఈ మూటిని మనసు నం దుంచు కొనుము. గతమును స్మరింపకయు, భవిష్యత్తును తలచి విచారము చెందకయు తఱుచుగా ఈ మూటిని గమనించుచుండిన చాలును.

ప్రాణు లన్నియు దర్శించునది ఒకే వెలుగును. శ్వాసించునది ఒకే వాయువును. సర్వప్రాణులు నొకే భూమియందు నివసించుచున్నవి. ఒక ప్రాణము పలుభాగములుగా విభాగితమై యున్నది. ఇట్లు యోచించి చూడగా జ్ఞానవిశిష్టులగుమానవుల ఆత్మ లన్నియు నొక అనంతాత్మయొక్క పలుభాగములే అని గ్రహింపదగును.

ప్రకృతిపదార్థము లన్నియు తమతమ వర్గములతోనే కలియుట సహజము. మృత్పిండసంజాతము లగువస్తువులు మృత్తులోనే కలియుటకు త్వరపడును. వాయురూపమున నున్న వస్తువులు వాయువులోనే కలియుటకు అభిలషించును. ఈ లక్షణమునకు విరుద్ధముగా తమతమ వర్గములతో కలియక వేర్వేఱుగా నుండుట నిర్బంధమువలననే. ఆనిర్బంధము తొలగగానే అవి తమ తమ వర్గములతోడనే కలియును. ఇటులనే జ్ఞాన మనులక్షణము కలిగిన ప్రాణు లన్నియు తమ తమవర్గములతోనే కలిసికొనగోయును. పదార్థ మెంతసూక్ష్మముగాను, ఉత్తమముగా నుండునో అది అంత త్వరితగతిని తనవర్గముతో కలియును. ఘనపదార్థములకంటె ద్రవపదార్థములసంయోగపు వేగ మధికము. ద్రవపదార్థముల వేగముకంటెను వాయురూపమున నున్న పదార్థముల వేగ మధికము. సూక్ష్మపదార్థముల సంయోగపు వేగముకంటెను బ్రహ్మపదార్థముల పరస్పరాకర్షణ శక్తి యింకను అధికముగానే యుండవలెను. జ్ఞానరహితము లగుప్రాణులను చూడుము, జడపదార్థములకు లేని సహకారచైతన్య

గుణములు వానికి గలవు. పురుగులును, పులుగులును, మొక్కములును గుంపులు గుంపులుగా చేరుచున్నవి. తల్లి తన సంతానమును పెంచి పెద్ద చేయును. ఆ సంతానము నందొక విధమగు కుటుంబజీవనవిధానమును, ప్రేమను దర్శింపవీలగును. జ్ఞానసంపన్నులగుమానవులు దేశము, మిత్రత, గృహము, జీవనవిధానము, సహకారము—మున్నగువానిని సంతరించుకొనుచున్నారు. యుద్ధములు చేసికొన్నను వారు త్వరితగతిని సంధి చేసికొనుచున్నారు. ఆకాశము నందున్న నక్షత్రములు ఒకదాని కొకటి దూరముగా నున్నను అవి ఒకదాని కొకటి లోబడియే ప్రవర్తించు విధమును గమనింపుము.

జ్ఞానసంపన్నులగుమానవులీ ప్రకృతిధర్మమును విస్మరించి ఒకరితో నొకరు యుద్ధములకు దిగుచున్నారు. ఇందువలన ఒకజాతితో మఱియొకజాతి కలియునట్టి ప్రకృతిధర్మమున కంతరాయ మేర్పడుచున్నది. కాని ప్రకృతిశక్తులకు వ్యతిరిక్తముగా సంచరించుట కష్టముతో గూడిన కార్యమే. పరిశీలించిన పిమ్మటనే యిది సుగ్రాహ్యమగును. లోకము నుండి విడివడి యెవ్వడును ప్రత్యేకముగా మనలేడు. అందులకై కావింపబడు ప్రయత్నము వ్యర్థమే యగును.

కష్టము నెదుర్కొనునప్పుడు దుఃఖభాజనునివలె ప్రవర్తింపవలదు. ఇతరుల ఆదరాభిమానములను ఆశింపవలదు. ప్రపంచగమనమును నీవు జ్ఞప్తియం దుంచుకొనవలెను. దీని

సాహాయ్యమున ఏది చేయదగినదో, ఏది త్యజింప దగినదో తెలిసికొందువుగాక!

నేడు కష్టములనుండి గట్టెక్కితి నని అనుకొందువు. కష్టములు హృదయమునందే యేర్పడునట్టివి. బాహ్య ప్రపంచమున ఏదియు లేదు. వానిని మనస్సునుండి పాఱద్రోలుటయే కష్టములనుండి బయటపడిన ట్లగును.

బాహ్యప్రపంచమును విడనాడి నీ మనస్సునే గమనింతువుగాక. శాంతి బడయుట కిదియే సాధన మగును. బ్రహ్మపదార్థపు తత్త్వమును గ్రహించి, అందలి యొక భాగము నేనై యున్నా ననువిషయమును విస్మరింపకుము. ఇతరుని పరీక్షించి యాతని హృదయమును అర్థము చేసికొందువుగాక! అప్పుడే ఆతడు దేనిని గ్రహించి చేసెనో, దేనిని గ్రహింపక చేయలేదో నీవు తెలిసికొనవచ్చును. అతని జీవన విధానమునకును నీ జీవితవిధానమునకునుగల తారతమ్యమును తెలిసికొనగలవు.

నీవు ప్రపంచములోని ఒక భాగ మగుదువు. నీవు చేయుపను లన్నియు ప్రపంచమున కనుకూలములుగా నుండవలెను. నీజీవితము ప్రపంచమునకు లాభదాయకముగా లేకున్నచో ఆ జీవితమే నిన్ను ప్రపంచమునుండి వేఱుచేయును. నీకును ప్రపంచమునకునుగల బాంధవ్యమును నాశ మొనర్చి నిన్ను కలహకారునిగా చేయును.

ఒకడు నీపై దోష మారోపించుచున్నాడు. మఱియొకడు నిన్ను ద్వేషించుచున్నాడు. ఇంకొకడు నిన్ను గూర్చి

అసభ్యముగా మాటాడుచున్నాడు. అట్లు మాటలాడిన నేమి? వారిహృదయములను పరీక్షించి చూడుము. వా రెటువంటి వారో యోచన చేయుము. వారు నిన్ను గుఱించి ఏమి తలచిన నేమి? అందులకై నీవు విచారింపదగిన కారణము లేదని నీవే తెలిసికొందువు. కావున వారిని ద్వేషింపకుము. వారును నీ మిత్రులే.

ఒరుని సంస్కరింప వీలు లేనప్పుడు నీ వతనిని ద్వేషింపకుము. నీకు భగవంతుడు దయా హృదయము నొసగియున్నాడు. ఈశ్వరుడు నీ యం దెంతదయగలిగియున్నాడో చూడుము. దుర్జనులు కూడ శారీరకముగా బాధావహు లగుచున్నారు; కీర్తి ప్రతిష్ఠలు పొందుచున్నారు. దైవము వలె నీవును దయార్ద్రహృదయుడ వై యుండుము.

చక్రమువలె అన్నియు క్రమపద్ధతిలో చుట్టిచుట్టి తిరుగుచున్నవి. పయికి పోయినది మరల క్రిందికి వచ్చును. ప్రతిసంఘటనయు భగవదిచ్ఛ ననుసరించి యొకదాని వెనుక మఱియొకటి క్రమముగా నేర్పడును. ప్రపంచ సంఘటనములలో కుంటువడని క్రమపద్ధతి యున్నది. ప్రతిదియు భగవన్నిర్ణయమే. అది మే లొదవించునదిగా నుండును. సంఘటనలు దైవమువలనగాక తమంత తామే ఏర్పడుచున్న వన్నను నీవు మాత్రము క్రమమును పాటింపుము. శాంతమును కోల్పోయి విచారము చెందవలదు.

త్వరలో సర్వము మృత్తుగా మాఱి భూమియందే కలియును. ఇటుల లోకము సతతము మార్పులకు లోనగు

చుండుటను గమనించినచో అస్థిరము లగువిషయము లందు దాసక్తి క్షీణించిపోవును.

ప్రపంచ మంతయు నొకప్రాణము; ఒక దేహము, ఒక హృదయము. ఏమి సంభవించినను అది ఆశరీరమునకు సంబంధించిన సంఘటనయే. అందలి యొక భాగముగా నున్న నీవు దాని నాక్షేపింపకుము. ఇది సత్యముకాదు; లోకమునకు ఆత్మయేది? అన్నిటికిని కారణము అణువుల సంయోగ వియోగములే గదా? అని యిట్లు తలచినను నీ వెందుకు మనోవైకల్యము చెందవలెను? నీ హృదయాందోళనమునకు కారణము గు నా చైతన్యమునకు చెప్పుము: "ఇసీ!-నీకు ప్రాణము లేదు. నీవు నిజ మగుపదార్థమవు కావు. నీ వసత్యము" అని తలచి యూరకుండువుగాక.

ఎవ రైనను లజ్జాకరముగా ప్రవర్తించినచో అందులకు నీ వతనిని కోపగింపకుము. లోకమునందు లజ్జాకరముగా ప్రవర్తించువారే లేకుండుటకు వీలగునా? లేరన్నచో ఎందుకు విచారము చెందవలెను? జరగని యొక సంఘటనమును ఆశింపనేల? లోకమునందు సిగ్గుబిడియములు లేనివారు కూడ కొంద ఱుందురు. ఎవరేని వంచనకాని, దొంగతనముకాని చేసినచో ఇటులనే చింతించి చూడుము. అట్టి దుష్టులీ లోకమున నుండరని తలచినచో వంచకునియందుగూడ కనికరము వహింతువు.

ఇదికాక మఱియొకవిధముగా గూడ యోచింపుము. ఇతరులతప్పిదములను సరకుసేయకుండుటకు నీయొద్ద ఔషధము

లున్నవి. నిన్ను ద్వేషించువానిని ప్రేమింపుము. వానికది యే మందు. తప్పుచేసినవానిని దిద్దుము. అతడు రాక్షసుడు కాడు. అతడు పతితుడు. ఇంకొక విషయము. ఒకని తప్పిదమువలన నీకు కలిగిన హాని ఎట్టిది? ఎవనియందు నీవు క్రోధము వహించితివో ఆతడు కలిగించిన కీడువలన నీ సహజస్వాభావమునందు మార్పు కలుగలేదు. కనుక నీకు కలిగిన హాని నీ మనస్సులో ఏర్పడినదే.

వివేకశూన్యుడు వివేకశూన్యునివలెగదా ప్రవర్తించును. ఇందాశ్చర్యమేమియు లేదు. ఇటుల భావింపకుండుట నీ తప్పు. అతడు అసభ్యముగా ప్రవర్తించునని గ్రహింపదగిన విజ్ఞానము నీలో నున్నది. దానిని మఱచి అతడు దోషమొనర్చెనే యని నీ విపుడు తలచుచున్నావు. ఇది నీ దోషమే.

ఎవరైనను నీకు ద్రోహము తలపెట్టినను కృతఘ్నతతో ప్రవర్తించినను వెంటనే నిన్ను నీవు పరీక్షించుకొనుము. అప్పుడు తప్పు నీదనియే తెలును. ఆతని స్వాభావమును నీవు గ్రహింపలేదే? అతనిని నీ వెందుకు నమ్మితివి? నీ వతనికి చేసిన యుపకారమే నీకది ప్రత్యుపకారము కాగా, ఆతని ప్రత్యుపకారము నెందుకు అభిలషించుచున్నావు? నీ సహజస్వాభావమున కనుగుణముగా సంచరించి అందులకు ప్రతిఫలము నడుగవచ్చునా? ఏ వస్తువైనను నిన్ను ప్రతిఫలమడుగుచున్నదా? కాళ్లతో నడుచుచున్నావు. అందులకవి నిన్ను ప్రతిఫలమును కోరెనా? తమ తమ ధర్మములను పాలించి అవి యూరకుండును. ఉపకారము చేయుచు జీవింప

వలసినవాడ వగుదువు. ఇతరులకు ఉపకారముచేసిన పిమ్మట నావిధ్యుక్తధర్మము నాచరించితి నని తృప్తి చెంది యూరకుం దువు గాక!

హృదయమా! బ్రహ్మత్వమును ఎప్పుడు పొందెదవు? సమతాస్థితిని ఎప్పుడు పొందెదవు? సర్వవ్యాపక మైన బ్రహ్మపదార్థమునందలి యానందము నెప్పుడు కనుగొందువు? బంధుసమూహము, వస్తువులు—మున్నగు వానిని ఎందుకు కోరెదవు? నీ యునికియే నీకు సంతోషము నొసగును. మహా శక్తిని ఎప్పుడు తెలిసికొందువు? పరిపూర్ణానందము నెప్పు డనుభవింపగలవు?

తప్పటడుగులు వేయు నతడు తప్పిదములు చేసిన చో ఆతనిని ప్రేమపూర్వకముగా సంస్కరింతువు గాక! అట్లొన ర్చుటకు నీ వసమర్థుడ వగుచో ఆ దోషము నీదే యగును. లేదేని సహనముతో మిన్నకుండుము.

అణువుల సంయోగమువలనగాని, ఆమహాశక్తి ప్రభా వమువలనగాని ప్రపంచ మేర్పడినను అందలి యొక భాగ ము నేనే. ప్రకృతిధర్మములకు లోబడినవాడను నేను. ప్రపంచమున కేది హితమో అదియే నాకును శుభోదర్క మని దాని నంగీకరింపవలెను. ఒక వస్తువునకు మేలు కలుగు నప్పుడు అందలి యొక భాగమునకు మాత్రము మేలు కలుగ కుండునా! ఏ పదార్థము నందైనను సరే ఉపకరింపని భాగ మనుచు నేదియు నుండదు. అందును కీడొదవించు వస్తువు నేర్పరచుకొను మని ప్రకృతిని నిర్బంధించు శక్తి బాహ్య

ప్రపంచమున ఏదియు లేదు. కావున ప్రకృతియందలి ఒక భాగ మగునేను ఏమి సంభవించినను సరే సంతుష్టుడ నై యుండవలెను. ప్రాణులకు—అందును నాతోడిమానవు లకు—హానికర మగుకార్యము నాచరింపకుందును గాక. ప్రపంచాభ్యున్నతికి అవరోధము కలిగించు చేతలు నా మన స్సులోనికి ప్రవేశింపకుండునట్లు నేను నామనస్సును పరి రక్షించుకొందును గాక. ఇట్లొనర్చినచో నా జీవితము సుఖాం తముగా ముగియగలదు. రాజాజ్ఞలకు బద్ధుడై యితరుల యోగక్షేమములను తలంచుచు నివసించు మానవుని జీవి తము సౌఖ్యావహ మై యుండును.

ఈగను పట్టగలిగినచో సాలీడున కది గర్వహేతు వుగా నుండును. కుందేటిని పట్టగలిగితి నని యొకడు గర్వము చెందును. మఱియొకడు పక్షిని వలలో వేసికొంటి నని సంతో షించును. వే ఱొకడు పరదేశీయులను బానిసలనుగా చేసి కొంటి నని గర్వించును. కాని వీని నన్నింటిని జ్ఞానవిశిష్టుడు హింసాకాండలుగానో, చోరకృత్యములుగానో భావిం చును. ప్రపంచమున ప్రతివస్తువును సృజించునది మహాశక్తియే. దానినే తిరిగి స్వీకరించునదియు ఆ మహాశక్తియే. రాగద్వేష రహితు డగువివేకవంతుడు "ఇచ్ఛవచ్చినట్లు నీవు ప్రసాదిం పుము." అని పేర్కొనును. ఇట్లనుటయందును అహం భావమును విడనాడుము. ఆ మహాశక్తి యెడల సభక్తికము గాను, సవినయముగాను నుడువవలెను.

సజ్జను డీ విధముగ నుండవలెను; ఆవిధముగా నుండవలెను, అని పరిశీలించితివి. ఇక ఈ పరిశీలనమును చాలించి సజ్జనుడ వగుటకు ప్రయత్నింతువు గాక.

మహాశక్తి నిర్ణయించునదియే ప్రతిమనుజునకును ప్రయోజనకారి యగును. ఏకాలమునం దేది అనుగ్రహింపబడునో అదియే శ్రేష్ఠము.

న్యాయశాస్త్రము విధించు శిక్షకు భయభ్రాంతుడై సంచరించువాడు దేశద్రిమ్మరి యగుచున్నాడు. అటులనే జీవితమునందు దుఃఖమును కనుగొని దుఃఖించువాడును, అందనివస్తువునకై అఱ్ఱులు చాచువాడును, కోపమునకు తావొసగువాడును న్యాయమునకు లోగక సంచరించువాడును దేశద్రిమ్మరి వంటి వాడగును.

ఇతరునకు వ్యక్త మొనర్పక ఏకాంతమందిరమున తన శయ్యపై కూర్చుండి దుఃఖించువాడును దేశద్రిమ్మరి యగుచున్నాడు. దైవనిర్ణయములలోని యుద్దేశములను తెలిసికొనుభాగ్య మొక్క జ్ఞానవిశిష్టు డగుమానవునకే కలదు. వాని ప్రయోజనములను తెలిసికొనలేకున్నను వాని నంగీకరింపవలెను.

ఇతరుడు చేసనతప్పును చూచి నీ వాగ్రహము చెందినచో తోడనే నీ ఆత్మపరీక్షను నీవే చేసికొనుము. అతనివలె నీవును దోష మొనర్చుచున్నావు. యోచనచేయుము. కీర్తి ధనములు మున్నగునవి సత్యపదార్థము లని నీవును తలచితివి గదా! ఈవిషయము నాలోచించిన నీ కోపము మటుమాయ

మగును. అతడు బుద్ధిపూర్వకముగా దోష మొనర్చు చున్నాడా ? అతనిసహజస్వభావమును మార్చుటకు నీకు వీలుగా నున్నచో, అట్లొనర్చుటకు యత్నింపుము.

ఏమి సంభవించినను సరే, సంభవింపకున్నను సరే నీకు లభించినపదార్థములనే యుపయోగించుకొని కాలానుగుణ్యముగా సంచరించుటకు యత్నింపుము. ఈవిషయములో నీకు స్వాతంత్రము కలదు. ఈ స్వాతంత్ర్యము నిర్నిరోధము. నీ వభిలషించుకార్యములకు విఘ్నములు కలిగినచో అప్పుడు వానికి తగినట్లుగా నీవు కార్యాచరణుడవుగమ్ము. కావున అవాంతరము లేర్పడుటచే నా ప్రయత్నము సఫలీకృతము కాలేదని నెపము చెప్పకుము. ప్రతిఘటనమునకు తగినట్లుగా ప్రవర్తించుటయే నీ కర్తవ్యము.

కార్యనిర్వహణము నందు ప్రతిఫలము ముట్టినను ముట్టకున్నను ధర్మసమ్మతముగా ఆ కార్యమును నెఱవేర్చుటయే సౌఖ్య మనియు, ఆనందప్రద మనియు తలంచునంత వఱకును నీవు కష్టము ననుభవించుచునేయుందువు. అస్థిర మైన సౌఖ్యము ననుభవించి కామాతురుడు మిక్కిలి సంతోషించునట్లుగా నీ ధర్మనిర్వహణము నం దంత సంతోషము ననుభవించునంతవఱకు నీవు దుఃఖించుచుందువు.

నీ యిచ్చవచ్చినట్లుగా ఒక జడపదార్థమును మార్చలేవు. దానియాకృతికి అనుగుణముగా దానిని మార్చవచ్చును. నీరు, నిప్పు మున్నగు జడపదార్థములును, జ్ఞానములేనిప్రాణులునుతమకు నచ్చినట్లుగా సంచరించుటకువీలుండదు

అవి నిరోధములకును, ప్రతిఘటనములకును కట్టువడియుండును. జ్ఞానవిశిష్టుల మగుమనము ఆటంకము లెన్ని కలిగినను సరియే వాని నతిక్రమించి వెళ్లుటకు—అనగా సమయాను కూలముగా సంచరించుటకు— తగిన శక్తి సంపత్తి మన యం దున్నది. స్వధర్మనిర్వహణము నం దాత్మకు స్వాతంత్ర్యము కలదు. అంతరాయములు జడపదార్థ మగు దేహమునే బాధించును. అవి చైతన్యవంత మగునాత్మను బాధింప నసమర్థములు. హృదయ సంజనితము లగువాంఛలవలననో, మనఅజ్ఞాన కృతముల వలననో మనము బాధావహుల మగు చున్నాము. ఇంతకు తప్ప ఆత్మకు బాధాకర మగునది మఱి యొకటి లేదు. ఈ మహాద్భాగ్యము మానవునకు మాత్రమే కలదు. ఇతర ప్రాణులకును, పదార్థములకును సంభవించు కష్టములు వెనువెంటనే వానిని బాధించును. ఏర్పడునట్టి అంతరాయముల కనుగుణముగా సంచరించు వానికి అనుభవ మును, సామర్థ్యమును ఎక్కు వగుచుండును. నీకు సంభ వించు ప్రతిఘటన మేదియు ప్రపంచ వ్యవస్థకు హాని కరముగా పరిణమించుటకు వీ లుండదు. తత్ వ్యవస్థకు హానికరము కానట్టిది లోకమునకును హానికరము కాజాలదు. లోకమునకు కీడొదవింపనిది లోకమునందలి సజ్జనునకును అవరోధము కాజాలదు.

దృష్టిదోషము లేని నేత్రము తన కభిముఖముగా నుండు సర్వమును తిలకించును. పచ్చనివస్తువులు మాత్రమే కనబడి మిగిలిన వస్తువులు కానరాకున్నచో దృష్టిలో

ద్దోష మేర్పడె నని నుడువదగును. అటులనే నాసికాశ్రోత్ర-
ములు గంధధ్వనులను గ్రహింప గలుగుచున్నవి. యంత్రము
నందెట్టివస్తువైనను నలిగిపోవునట్లుగా, వ్యాధి లేని యుదరము
నందెట్టిపదార్థమైనను సులభముగా జీర్ణమగును. ఇటులనే
వ్యాధి లేని హృదయము నందేమి సంభవించినను అది జీర్ణమై
పోవును. అనగా సహనముతో అవరోధము నెదుర్కొని
దాని నతిక్రమింపవలెను. నా ఆత్మీయుల కిది లాభ కారణమా?
దీనిని ప్రజ మెచ్చునా? అని యోచన చేయునతడు వ్యాధి
గ్రస్తుడే యగుచున్నాడు. దీనిని చూడగలను, దీనిని చూడ
లేను అని వాకొను దృష్టి దోషము గలనేత్రమువలెను,
దీనిని నమలగలను, దీనిని నమల లేను అని నుడువు
పల్వరుసవలెను అతని హృదయము కూడ ఆరోగ్య రహిత
మగు హృదయమే యగును.

ఎట్టి సద్గుణ సంపన్నుడైనను అతడు విగతజీవు
డైనచో అందులకు సంతసించువారు కొందరుందురు. జ్ఞాన
సంపన్నుడును, గంభీరభావబంధురుడు నగు నొకడు మర-
ణింపగా, 'అబ్బా! అతడు మరణించినాడు. ఇక మనము
సౌఖ్యముగా మనవచ్చును. అతడు మనలను బహిరంగము
గానే నిందించుచుండెను. ఈ విషయము నాకు చక్కగా తెలి
యును.'' అని ఒక్కడైనను తప్పక నుడివి సంతోషించును.
సజ్జనులకే యీ దుర్గతి పట్టుచుండగా దోషపూరితుడ నగు
నావంటి వానిని గూర్చి చెప్ప నక్కఱయే లేదు. ఒకని మరణ
మునకై కొందఱు నిరీక్షించుచున్నారు. ఈవిషయమును

తెలిసికొన్నచో నీవు సహర్షముగా మరణము నెదుర్కొందువు. ఎవరికై నేనింతకాలము పాటుపడితినో, భగవంతుని ప్రార్థించితినో, మనోవ్యథ చెందితినో వారే నేనెప్పుడు నశించిపోవుదునా యని తాపత్రయ పడుచున్నారు. ఇట్టి జీవితమును చాలించి ప్రాణపరిత్యాగ మొనర్చుటలో దుఃఖమే మున్నది? ఇంకను ఎందుకు జీవించి యుండవలెను?

ఇట్లు ప్రాణముతో నుండుటను ద్వేషించి, మానవులను ప్రేమించక వారిని ద్వేషించుచు వారితో శత్రుత్వమును సంపాదింపకుము. ధర్మము, ప్రేమ, సదుద్దేశము, ప్రశాంత చిత్తము మున్నగువానిని సంరక్షించుకొనుము. ప్రాణమును పీడుటకు మాత్రము మనస్సును స్థిరముగా నుంచుకొనుము. సహర్షముగా మరణము నెదుర్కొందువుగాక! అనాయాస మరణమును పొంది శరీరమునుండి ప్రాణము సుఖముగా విడివడుటకును, స్వజాతి యనియు, స్నేహితులనియు పక్షపాతము చూపకుండునట్లును నీ మనస్సును సంరక్షించు కొనుము. అందులకు ప్రయత్నింపుము. బంధుమిత్రాదులతో ని స్నే మహాశక్తి జతగూర్చెనో ఆ శక్తియే యిప్పుడు నిన్ను వారినుండి వేఱు చేయుచున్నది. సన్నిహిత సంబంధముగల వారినుండి వేఱు చేయుటయే ప్రకృతి లక్షణము. వృక్షమునందలి యాకులు రాలిపోవుటను పరికింపుము.

సూత్రధారుడు లోపల నున్నాడు. మాటాడునది అతడే. అతడే పురుషుడు. ఆతనిచే ఆవరింపబడియున్న

యీ దేహమును 'నీది' అని భ్రమ చెందవలదు. శరీరము నందలి కర్మేంద్రియములను ఆత్మ అని భావింపకుము. వడ్రంగియొద్ద నున్న ఉలి, బాడిత మున్నగువానివలె ఇవి కేవలము పరికరములు మాత్రమే. ఇవి దేహమునందే యతికింపబడి యమర్పబడిన సాధనములు. అంతర్గతమై వీనిని క్రమపఱచుచున్న యాత్మను విస్మరించి యీ సాధనములే మంచి వని సంభావించుట పొరపాటు. చెట్టు నఱకువానికి గొడ్డలియు, నేల దున్ను వానికి నాగలియు, బండి తోలువానికి కొరడాయును—మున్నగువానివలె—ఇవి ఆత్మకు పరికరము లగుచున్నవి. లాభనష్టములు ఆత్మయందే యంతర్భూతములై యున్నవి.

జ్ఞానముగల ప్రాణియొక్క లక్షణములను చూడుము. తన్ను తాను తెలిసికొనుటకును, తన్ను గూర్చి యితరులకు చెప్పుకొనుటకును, తాను కోరినట్లు తానే చేసికొనుటకును దానికి వీలగును.

ఒక నాటకము నందేదేని అవాంతర మేర్పడినచో అది అసంపూర్తిగానే యుండును. కాని జ్ఞానవిశిష్టుడగు ప్రాణి జీవిత మట్లు కాదు. ఏ సమయమునందైనను ఏది సంభవించినను అది పరిపూర్ణముగానే ముగియును. సంఘటనమునకు తగినట్లుగా కర్తవ్యమును నిర్ణయించుకొని కార్యసాఫల్యమును పొందుము.

జ్ఞానవిశిష్టుడగు ప్రాణి యొక్క విజ్ఞానమునకు ప్రపంచము లోబడును. తన్నావరించియుండు గగనము, కాలము, కల్పము—సర్వమును—లోకము తెలిసికొనెడి పదార్థములు. భూతభవిష్యత్కాలములను గ్రహించును. ప్రేమ, సత్యము, విధేయత—ఈ లక్షణములు జ్ఞానము గల ప్రాణి యందుండును. ఆత్మయే ఉత్తమపదార్థ మని గ్రహించును.

నృత్తగీతములును, వినోదములును లాభరహితములని తలచి వానిని విసర్జింపుము. విసర్జించుట కష్టముగా తోచినచో వీనులవిందగు పాటను శబ్దముగాను, కన్నుల పండువగు నృత్యమును అభినయ విశేషముగాను వానిని వేర్వేఱుగా విభజించి చూడుము. ఉపయోగ రహిత మైనయిదియా నన్ను భ్రమింప జేయుచున్న దని తలచి నీవే అప్పుడు వానిని విసర్జింతువు. సద్గుణమును, సత్కార్యమును తప్ప అన్యములను ఈవిధముగా విభాగించి చూచి తుచ్ఛము లైనవానినుండి మోహబంధమును త్రెంచుకొందువుగాక! అస్థిరములగు పదార్థములందలి మోహమును విసర్జించుట కిదియే మందు. మోహమునకు కారణభూత మగువిషయములను నీ మనస్సున విభజించి చూడుము అప్పుడు మోహము నశింపగలదు.

ఏ నిమిషములో ప్రాణము పోయినను సరియే సంతోషముతో మరణము నెదుర్కొనుము. ఇది ఆత్మకు గర్వహేతువుగా నుండును. ప్రాణమున్నప్పుడును, ప్రాణము

పోవునప్పుడును సమతాస్థితితో నుండుటయే గొప్పతనము. ఈ సమతాదృష్టి లోకజ్ఞానమువలన ఏర్పడవలెను. ఇతరులు ని న్ననుసరించు నట్లుగా నీవు సమతాదృష్టి నలవఱుచుకొని యుండవలెను. అట్లు కాక జీవితమును ద్వేషించి మరణమును వాంఛింప గూడదు. నిరాడంబరముగా సమతాదృష్టి నలవఱుచు కొనవలెను.

---

ఇతరునకు నేనుపకారము చేసితినా ? చేసినచో నేనే ఉపకారము పొందిన వాడ నగుచున్నాను.

చెట్టునుండి కొమ్మను నఱికినచో అది చెట్టునుండి వే అగును. అటులనే యితరునియందు ద్వేషము వహించి వానినుండి విడివడునతడు లోకమునుండి వేఱుపడిన వాడగును. చెట్టుకొమ్మ వేఱొకనిచే నఱకబడును. కాని లోకమునుండి వేఱుపడు మనుజుడు తన్ను తానే అజ్ఞానముచే ఛేదించుకొన బడుచున్నాడు.

వృక్షశాఖ విడివడుటకును, మానవుడు విడివడుటకును నడుమ భేద మున్నది. విడివడిన కొమ్మ మరల వృక్షమున చేరుటకు వీలుకాదు. మానవుడు వేఱయినచో అతడు తిరిగి మానవులతో చేరుటకు వీ లగును. ఈశక్తి మానవునకు భగ త్తము. కాని తఱుచుగా వేఱుపడుచుండినచో మనము మరల కలియుట కష్టమే. తోటమాలి నడిగిన అతడిట్లు చెప్పెను. 'ప్రకృతిలో సహజముగా ఏర్పడిన కొమ్మ గుణములును, దోహదక్రియ మూలముగా పెరిగిన కొమ్మ గుణములును విభిన్నములు' అని. ఇతరుల మనోభావములు విభిన్నములుగా నున్నను వారితో కలసి జీవించుటయే నాకర్తవ్యము.

అవరోధములు కలిగించు వారి కృత్యములను చూచి వివేకమును కోలుపోవక సక్రమముగా నీవు నీ ధర్మము నిర్వర్తింపుము. వారిని నీవు ప్రేమింతువుగాక. నీ జ్ఞాన

మును, ధర్మమును సంరక్షించుకొనుము. ఇటుల సంర క్షించుకొనుటకు వెనుకాడకుము ప్రారంభించిన పనిని ఆటంకములకు భీతిల్లి విసర్జించుట పౌరుష మనిపించుకొనదు. విఘ్నములు కల్పించువారలను కోపగించుట కూడ పౌరుష విహీన కార్యమే యగును. లోకు లందఱును నీ చుట్టములే గదా!

నిన్నొకఁడు దూషించె నని యనుకొందము. ఆదూష ణోక్తులు అతనినే బాధించును. కావున నీవాక్కర్మలు సభ్యతా రహితములుగా నుండగూడదు. ఒరుఁడు నీపై శత్రుత్వము వహించె నని యనుకొందము. అది యతనినే బాధించును. అతనిని ప్రేమింపుము. అతనికి జ్ఞానస్వరూపమును తెలియ జేయుము. ఆ సమయమున అతనిలోని దోషములనే ఎక్కువగా చూపి అతనిపై నిందారోపణము చేయకుము. నీ సహనమునే ఎక్కువగా ప్రదర్శింపకుము. మనఃపూర్వకముగా అతనికి సహాయ మొనరించి అతని భావములను సంస్కరించి అతనికి మేలు చేయుదువుగాక! క్రోధమాలిన్యరహిత మగు నీ హృదయపారిశుద్ధ్యమును దైవము చూడవలెను. అందు వలన నీ మనస్సును నిష్కల్మషముగా నుంచుకొనుము. నీ ధర్మము ననుసరించి నీవు ప్రవర్తించినచో నీ కెట్టి లోపము కలుగుటకు తావు లేదు.

నీ సౌఖ్యము నీ మనస్సులోనే యున్నది. ఆత్మను బాధింపని విషయములు గణింపదగినవి కావు. లోకము నర్థము చేసికొని ప్రతి విషయమును సావధానముగా విచారింపవలెను.

బాహ్యపదార్థ మేదియు మనస్సును బాధింపజాలదు. నీమనస్సు నందలి భావములకు నీవే యధికారివి. బాహ్యపదార్థములచే నుత్పన్నము లగుభావములనుగాక యితరములను కూడ స్వీకరించుటకు నీకు శక్తి కలదు. ఇటుల బాహ్యపదార్థములచే పీడింపబడకుండ మనస్సును సంరక్షించుకొనుటకు వ్యవధియు ఎక్కువగా లేదు. త్వరగా ప్రాణమును వీడి విముక్తి చెందుము. మనస్సు తాటస్థ్యము వహించునట్లు ప్రవర్తింపుము. స్వభావసిద్ధముగా ఏర్పడు సంఘటనములను గూర్చి ఎందుకు మనస్సు విచారము చెందవలెను? అట్లుకాక దైవికముగా అవి ఏర్పడినను నీ ప్రకృతి ధర్మము ననుసరించియే ప్రవర్తింపుము.

క్రోధమానస్కుడ వగునపుడీ క్రింది విషయములను జ్ఞప్తి యందుంచుకొనుము. మొదటిది: ఇతర మానవులకును నీకును గల సంబంధ మెట్టిది? వా రెవరు? పరస్పరము సహాయము చేసికొనుచు జీవించుటకే కదా మనము జన్మించినాము. పశుసంఘమునకు ముందు నడచుట కేర్పడిన వృషభమువలె నీవును ఏర్పడినావు. పథప్రదర్శకుడ వగుటకు మాఱుగా కోపము చెందవచ్చునా? ప్రపంచము కేవలము అణుమయమా? లేక అకస్మాత్తుగా ఏర్పడినదా? సర్వమును ప్రవర్తింపచేయుచున్న బ్రహ్మపదార్థ మొకటి కలదా? అన్నియు నొకటిగా కూడి మనవలెను గదా! అందులకే మనము సృజింపబడినాము.

రెండవది: ఎవరిపై నీకు కోపము? వారి స్వభావ మెట్టిదో తెలిసికొంటివా? వా రేమి భుజించుచున్నారు?

ఎట్లు నిద్రించుచున్నారు ? వారి మనఃప్రవృత్తి యెట్టిది ? వారి లోని అజ్ఞానాహంకారములను నీవు గ్రహించితివా ?

మూడవది : వారు చేసినది ఒప్పా? తప్పా? ఒప్పుగా నున్నచో కోపము వలదు. తప్పుగా నున్నచో అవివేకము వలనగదా వారట్లు చేసిరి. దోషమని తెలిసినను వారు మన స్సునకు తెలియకుండ తప్పు చేసియుందురు. ఎవరును స్వతంత్రించి తప్పు చేయరు. కనుక వారిపై దోషము నారోపించుట దోషమే యగును. ఏ కారణములవలన వారు ధర్మచ్యుతులైనారో ఆ కారణములే దూష్యములు.

నాలుగవది : నీవే ఎన్నో సందర్భములలో దోషము లొనర్చితివి. వారివలె దోషరహితుడవుగా నుండుటకు నీవు యత్నించితివి. అది మాత్రము ప్రశంసనీయమా? దోష మొనర్చుతలంపు నీకు లేనేలేదా? భయమువలననో, లోక నిందకు భీతిల్లియో, ఏదో యొక కారణమువలన భయపడి నీవు దోషము చేయక బయటపడితివి.

ఐదవది : అతడు దోషమొనర్చెనని నీ కెట్లు తెలి యును! ఒక కార్యమునకు పలుకారణము లుండును. ఇత రుడు చేసినది దోషమని నిర్ధరించుటకుముందు ఎన్నో విష యములను పరిశీలింపవలెను.

ఆఱవది : ఎక్కువ కోపము కలుగునపుడును, సహ నము నశించు వేళను, ఒక్క విషయమును మనస్సునం దుంచు కొనుము. మానవుని ఆయుర్దాయము చాల పరిమితము.

కొన్నినాళ్లకు పిమ్మట మన మందఱము గతించినవార మగుదుము.

ఏడవది : ఏది నిన్ను బాధించుచున్నది? ఇతరుల కృత్యములు కావు. వానిని గూర్చి నీవు నీ మనస్సునందుంచు కొనిన భావములే నిన్ను పీడించుచున్నవి. బాహ్యపదార్థము లేవియు నీ యాత్మను స్పృశింప లేవు. నీ చేతలే నిన్ను బాధించును. ఏదేని ఒక కార్యము నీకు ప్రోత్సాహ మొసగునదిగా నున్నచో అప్పుడు దానిని మార్చుకొనుము. కాగా కోపము తనంత తానే మటుమాయ మగును. ఇతరుని దోషము నీ ఆత్మను సమీపింపదు; అది హానికరమును గాదు. ఇతరులు కలిగించు నుపద్రవములవలన నీవు దుష్టుడవు గాను, చోరుడవుగాను మాఱిపోవుదువా?

ఎనిమిదవది : దేనిని నీవు హానికర మని తలచి విచారించుచున్నావో దానిని చూచి కోపము బూనుటయు, దుఃఖించుటయు దానికంటెను పదిరెట్లు హానికరము లగును.

తొమ్మిదవది : ప్రేమయే జయము సాధించును. ఏదియు దానిని జయింపలేదు. నిజమైన ప్రేమకే యట్టి శక్తి కలదు. పైపై నవ్వులకును, నటనకును ఆశక్తి మృగ్యము. ప్రేమమయమైన నీ హృదయమునుండి ప్రేమను కోలుపోవక, తగినతరుణమును చూచి లలితోక్తులతో నచ్చచెప్పినచో నిన్ను ద్వేషించినవాడు గూడ అప్పుడు నిన్నేమి చేయగలడు? అతడు నీకు కీడు తలపెట్టినప్పుడెల్ల 'తమ్ముడా! వలదు. ఎందులకు మనము జన్మించితిమో తెలియునా?

నీ కృత్యములు నన్ను బాధింపవు. అవి నీకే హానికరములుగా పరిణమించును.' అని అతనికి నచ్చచెప్పుము. నిష్కల్మష హృదయముతోను, పరిపూర్ణ మైన ప్రేమతోను, నిందాగర్భితము కాకుండగను, పరిహాస ప్రాయము కాకుండగను మాటలాడి అతనికి త్రోవను చూపవలెను. ఉపన్యాస ధోరణియందో, ఇతరుల ప్రశంసల నాశించియో ఉపదేశము చేయకుము. ఏకాంతముగా నున్నప్పుడు ఆత్మతో ఆత్మ సంభాషించురీతిగా మాటలాడుము.

ఈ తొమ్మిది విషయములను భగవంతుని వరప్రసాదములుగా సంభావించి జ్ఞప్తియందుంచుకొనుము. ప్రాణమున్నంతవఱకు మానవ ప్రకృతి కనుగుణముగా నుండునట్లు జీవింప యత్నింతువుగాక! తోడిమానవుని కోపగింపకుము. అటులనే అతనిని పరిహాసింపకుము. ఈ రెండును హానికరములు ; అపకార హేతువులును.

కోపము తెచ్చుకొనుట మానవత్వము కాదు. సహనము, సరససంభాషణము – ఈ రెండును – మానవత్వమునకు చిహ్నములు. క్రోధమనస్కుడు ధైర్యవిహీనుడు ; శక్తి రహితుడును. మనోవైకల్యము చెందక ఎప్పు డుండ గలవో అప్పుడే నీవు శక్తిసమన్వితుడవు కా గలవు. మానవత్వము లేనివాడే దుఃఖభాజనుడు. అతడే కోపము తెచ్చుకొనును. దుఃఖితుడును, కోపమనస్కుడును కష్టముల కెదురొడ్డి నిలువజాలరు.

మఱియొక విషయమును మనస్సునం దుంచుకొనుము. తప్పు చేయుట మతివిహీనుల లక్షణము. వారు దోష ములు చేయ రని తలచుట ఉన్మత్తతయే యగును. ఇతరుల యెడల వారు మతివిహీను లై మెలగునపుడు అందులకు నీవు విచారింపవు. కాని నీ యందు మాత్రము వారు సగౌరవముగా ప్రవర్తింతు రని నీ వనుకొందువు. ఇది దోషము కాదా?

నీ శరీరమునందు గల పంచభూతములలోని వాయు రశ్మిలు ఊర్ధ్వముగా పయనించి అదృశ్య మగునట్టి లక్షణ మును కలిగియున్నను అవి నీ శరీరమును వీడి స్థలాంతరము లకు వెడలుట లేదు. అటులనే పృథివ్యాపములు అధోముఖ ముగా పోయి భూమిని, నీటిని కలియక నీ శరీరమునందు వాని లక్షణములకు విరుద్ధములుగా నున్నవిగదా! ఇట్లు భూతములు తమతమ నియమితస్థానములను విడనాడక తమకు విధింప బడిన ధర్మముల నాచరించుచున్నవి. ప్రాణము పోవునంత వఱకును అవి బ్రహ్మపదార్థపరిపాలనమునకు లోబడి తమలక్ష ణములను గూడ విస్మరించి యున్నవి. ఇట్లుండగా నీ జ్ఞానము మాత్రము మాట వినక ఎందుకు విచారించుచున్నది? భూత ములనో బాహ్య పదార్థము లెదుర్కొనును. కాని తన ధర్మ మునకు లోబడి ప్రవర్తించు స్వాతంత్ర్యము మనస్సునకు ప్రసా దింపబడినది. అయినను మనస్సు ధర్మమార్గమున నుండక అన్యమార్గమున సంచరించుచున్నది. ఎంత ఆశ్చర్యము! అవి నీతిప్రవర్తనకు పాల్పడుట, అవిధేయముగా నుండుట, కోపము తెచ్చుకొనుట, భయమునకు లోనగుట, ప్రశాంతతను కోలు

పోవుట—మున్నగునవి భగవదాజ్ఞను మీఱి సంచరించుటయే యగుచున్నవి. జరిగిన సంఘటనను చూచి చింతించు మనస్సు తనకు విధింపబడిన కర్మను ఆచరింపక దైవాధికారమును ధిక్కరించిన ట్లగును. సహనసత్యములును, భక్తియు ఆత్మకు మిక్కిలి యవసరములు.

నీకు వ్రాయను చదువను తెలిసినందువలననే కదా యితరులకు వ్రాయను చదువను నేర్పుటకు వీ లగుచున్నది. పలుదినములు నీవు శిక్ష పొందిన కారణమునగదా నీ వితరులకు బోధింపగలుగుచున్నావు. ఉత్తమజీవితమును గూర్చియు నిటులనే బోధింపవలెను. అక్షరజ్ఞానమును కలిగించుటకంటె ఉత్తమజీవితమును గూర్చి బోధించుటయే దుష్కర మయిన కార్యము. అందువలన ఇతరులను సంస్కరించుటను మాని తొలుదొలుత నిన్నే నీవు సంస్కరించుకొనవలెను.

ఎందుకు నీవు దుఃఖించుచున్నావు? కావలసినవన్నియు నీవు సులభముగా పొందగలవు. గతమును మఱచిపొమ్ము. భవిష్యత్తున సంభవించునవి దైవాధీనము లని తలచి దిగులు మానుము. నీవు యోచింపవలసినది వర్తమానకాలమును గూర్చియే. వినయవినమ్రుడవై కాలమును వెళ్లబుచ్చుటకు యత్నింపుము. సంభవించువాని నన్నిటిని సహర్షముగా స్వీకరించుటకే వినమ్రత యని పేరు. దైవనిర్ణయము నంగీకరించుటయే వినయము. నీతి అనగా నిజమును దాచక మాటాడుటయే. ధర్మబద్ధముగా సంచరింపవలెను. ఇతరుల తలపోతలనుబట్టి కాని, మాటలనుబట్టికాని నీవు చేయు

పనిలో మార్పు రాగూడదు. శరీరమున కేమి సంభవించినను సరే నీ వాక్కర్మలు ధర్మబద్ధములు, సత్యయుతములు నై యుండవలెను. మరణము సన్నిహితముగా నున్న దని తలచి ఆత్మయొక్క విశిష్టతను గుర్తించి యన్యములను పరిత్యజింప వలెను. ధర్మవిరుద్ధముగా ప్రవర్తించుట హానికర మనుభయ మును మాత్ర ముంచుకొని మరణమును చూచి నిర్భయ ముగా నుండవలెను. అప్పుడే నీ జన్మము చరితార్థము కా గలదు. ఎట్టిసంఘటనమును చూచియు భయపడకుము. బాహ్య పదార్థములయందు మనస్సును కేంద్రీకరింపకుము. కేంద్రీక రించిన నీ వే లోకము నందలి యొకభాగమ వై యున్నావో ఆలోకమునుండి విడివడిపోయి దేశభ్రష్టునివలె సంచరింతువు.

అంతర్గతము లైన మన తలంపులను భగవంతుడు స్వయముగా పర్యవేక్షించుచున్నాడు. తననుండి యేర్ప డిన ఆత్మలతో ఆతని హృదయ మెప్పుడును కలిసియే యుండును. నీవును చింతను మాని జ్ఞానమయ మైనజీవితము గడపినచో ఆత్మ నావరించుకొని యున్న శరీరమును మఱచి పోగలవు. అంతర్గత మైయున్న సత్యపదార్థమును కనుగొను టకు అభ్యాసముచేసికొనుము. శరీరమును విస్మరించి ఆత్మ నన్వేషించువాడు మేడమిద్దెలు, పేరుపెంపులు, వస్త్రా భరణములు, అధికారవాంఛ-మున్నగువానియందు మమకా రము నుంచుకొనడు.

ప్రయోజనరహితము లగుకార్యములను చేయువలదు. ప్రయోజనము నుద్దేశించియే కార్యాచరణమునకు పూను

కొనుము. అనగా ప్రజోపయోగార్థము లగుకార్యములందే నిమగ్నుడవుగమ్ము.

త్వరలో శరీరమును వీడి నీవు వే ఱగుదువు. ప్రకృతము నీ దృక్పథమున గల సర్వ పదార్థములు నశ్వరములే. ప్రకృతి యందలి యొక్కొక్క పదార్థము నొక్కొక్కతూరి నశించుచు మరల వేర్వేఱు పదార్థములుగా ఏర్పడుటకే సృజింపబడినవి.

నీకు సంబంధించినంతవఱకు లోక మనునది నీ భావనా బలమువలన నిర్మిత మయినట్టిదే కాని మ ఱేమియు కాదు. నీ భావనాశక్తి నీ యధీనమునందే యున్నది. నీ మనస్సును క్రమబద్ధము కావించికొని శాంతిని పొందుదువుగాక!

సకల సుఖదుఃఖములును, వాంఛలును నీ మనస్సులో నుత్పన్నము లగు భావములే తప్ప నన్యములు కావు. దుఃఖము కలిగినప్పుడు దీనిని స్మరణకు తెచ్చుకొనుము. అన్నియు ప్రపంచగమనము నుద్దేశించి జరగుచున్నవి. ఎవని దోషము వానినే బాధించును. అది నన్ను బాధింపదు. ఏదియు నూతన మైనది కాదు. ఇప్పుడు నాకు సంభవించి నట్టిది పూర్వము కూడ సంభవించియే యున్నది. ఈక్షణ మునం దింకను పలువుర కిది సంభవింప నున్నది. మానవు లెల్లరును ఏకకుటుంబమునకు చెందినవారు వారి బంధుత్వము చాలసన్నిహిత మైనది. ఆ సంబంధము శారీరక మైనది కాదు. ఆత్మలనడుమగల సంబంధ మది. ఆత్మ దైవమునుండి యుత్పన్నమైన పదార్థము. అది దైవాంశ సంభూతము. 'నాది'

అనునది ఏదియు లేదు. శరీరము, సంతానము, ఆత్మ—ఇవి యన్నియు భగవద్దత్తము లగు పదార్థములే. కనుక ఇవి ఆతని వస్తువులే.

భూతభవిష్యత్కాలములు మానవునివి కావు. వర్తమాన కాలమునందే అతనికి స్వామ్యము కలదు. కాని అతడు వర్తమానమును గాక కడమ రెండు కాలములను గూర్చి తలపోయుచు తన కాలమును దుర్వినియోగము చేసికొనుచున్నాడు.

విశేషవిఖ్యాతి సముపార్జించినవారును, మిక్కిలిగా శ్రమించిన వారు నగు చారిత్రక పురుషులను తలచి చూడుము. వారెల్లరును ఇప్పు డెక్కడ? వారి జీవిత విశేషాదికము కాలగర్భమునందు కలసిపోయి ఒక గాథగా రూపొందినది. ఆ గాథను కూడ కొందఱు మాత్రమే వాకొనుచున్నారు. అదియును త్వరలోనే కాలగర్భమున కలసిపోగలదు.

పలువిషయములను గూర్చి చింతన చేయుటలో లాభ మేమి? దైవమునకు లోబడి సత్ప్రవర్తనాభిలాషివై జీవించుటయే కదా గొప్పతనము. ఇట్టి జీవితమును వినయ విధేయతలతో సాగింపవలెను. విధేయత మనస్సునందే యుండవలెను. బాహ్యమున విధేయునివలె నటించుచు మనస్సునందు అహంభావ పూరితుడవై యుండుట అహంభావము నందును గొప్ప అహంభావముగా గణింపబడును.

దైవము, దైవము— అని చెప్పుచున్నావు; దైవమును నీ వెక్కడ చూచితివి? అని ప్రశ్నింతురు. దైవమును దైవ విలసనముల యందే దర్శింప నగును. మన ప్రాణమును మనము కన్నులార గాంచుచున్నామా? కాని అది యున్నదని తలచి దానిని గుఱించి కొండంతగా తలచుట లేదా? ప్రతివిషయమునందును దానికి సేవచేయుచున్నాము. అటులనే దైవమును దైవ విలసనములవలన నా యనుభవములో సతతము సందర్శించి నమస్కరించు చున్నాను.

జీవితమును సంరక్షించునది వివేకమే. ప్రతిపదార్థమునందును గల కార్య కారణములను గూర్చి విచారణ చేయుచును, న్యాయసమ్మతముగా ప్రవర్తించుచును, సత్యమును భాషించుచునున్నచో జీవితము ధర్మమార్గమునందే సాగిపోవును.

సూర్యుని వెలుగు సర్వత్ర వ్యాపించుచున్నది. పర్వతము, కుడ్యము ఇంకను పలువస్తువులు దానిని నిరోధించుచున్నవి. కాని కాంతి మాత్ర మొకే తీరున నున్నది. అటులనే వివిధపదార్థముల యాకృతులు విభిన్నములుగా నున్నను అవి యన్నియు ఒకే ప్రకృతి పదార్థములే. వానిలో ఆత్మ లనేకము లున్నను వానికి సర్వవ్యాపక మైన అనంతాత్మయే మూలము. అన్నిటియందు నొకే బ్రహ్మ పదార్థము గోచరించుచున్నది.

కాలము నిరవధికము. అందు నీకు లభించిన భాగము అత్యల్పము. ఈ విశాల ప్రపంచమునందు నీ శరీర మెంత

చిన్నభాగము! పరమాత్మ యొక్క స్వరూప మెట్టిది? అందు నీ వెంత చిన్న భాగమవో! నీవు నడుచుచున్న భూమి కూడ మహాప్రపంచనము నం దెంత చిన్న భాగమో! పరాశక్తి చిద్విలాసమును నెఱవేర్చుటయే జీవితము. అన్యములు క్షుద్రములు.

ఆత్మను పరిశుద్ధముగా నుంచుకొని దాని నుపయోగించుకొనుటయే గొప్పతనము. అదియే శుభావహము. మిగిలిన వన్నియు అనిత్యములు. అవి ధూమములో కలిసి పోవును.

ఈ లోకమునుండి ఐదుసంవత్సరములకు పూర్వము నీవు నిష్క్రమించిన నేమి? పిమ్మట నిష్క్రమించిన మాత్ర మేమి? ఏ శక్తి నిన్ను సృజించెనో ఆ శక్తియే నిన్ను పొమ్మనుచున్నది. ఇందులో తప్పేమి కలదు? నాటక సూత్రధారుడు నటుని పొమ్మని చెప్పుటలో తప్పేమి కలదు? "అయ్యో! నాటకము పూర్తిగా ఆడలేదే" అని నుడువుదువు. నాటకము ముగియని మాట వాస్తవమే. కాని పరిసమాప్తము చెందని నాటకమే నాటకము. నాటక సూత్రధారుడు నిర్ణయించిన ముగింపే ముగింపు. నాటకమునకు గాని, నాటక పరిసమాప్తమునకుగాని నీవు కాదు యజమానివి. అందువలన కలత చెందక దేహమును త్యజింతువు గాక! శాంతిని పొందగలవు. దైవమే శరణ్యము.

---